Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు · స్థాపితం: 1930 · జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్ రైతు

సంపుటి: 82 • సంచిక: 17 • 29-4-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# మంత్రుల మూకుమ్మడి సమ్మె!

- కిరణ్ అంటే ఒక్కరికీ లెక్క లేదు.
- నువ్వెంతంటే నువ్వెంత అన్న కోమటిరెడ్డి.
- కడప ఎన్నికలలో అందరిదీ దొంగాట.
- జగన్‌తో ముచ్చట్లు, చందాలు.
- అధిష్టానం తీవ్ర అసంతృప్తి.

ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి పరిస్థితి ఎవడికి పుట్టిన బిడ్డవురా వెక్కి వెక్కి ఏడ్చేవు అన్నట్లుంది. పేరుకే ఆయన ముఖ్యమంత్రి. ఒక్క మంత్రి కూడా ఆయన్ను ముఖ్యమంత్రిగా గుర్తించడం లేదు. కిరణ్‌కుమార్‌రెడ్డి వ్యవహార శైలి అందుకొక కారణమైతే, ఆయనకు అధిష్టానం మద్దతు లేదన్న అభిప్రాయం అసలు కారణం. వైఎస్‌ను చూసిన కంటితో కిరణ్‌ను చూడడం కష్టంగా వుంది మంత్రులకు. వైఎస్ కాలంలో మంత్రులు, ఎమ్మెల్యేలకు కోరినంత సొమ్ము, అడిగిన ప్రతి పనికీ అడ్డం వుండేది కాదు. కానీ కిరణ్ అట్లా ఫైళ్ల మీద సంతకాలు పెట్టలేక పోతున్నాడు. అది ఆయన తత్వం. దోచిపెట్టిన ముఖ్యమంత్రిని చూసిన కంటితో, దాచిపెడ తామని చూసే ముఖ్యమంత్రిని చూస్తే మొట్ట బుద్దేయడంలో వింతేమీ లేదు కదా? మరొక ప్రక్క వైఎస్, రోశయ్యలకు అధిష్టానం మద్దతు పూర్తిగా వుండేది. వారు ఏమి చెప్తే ఢిల్లీలో అదే జరిగేది. సోనియా గాంధీ వారి మీద మాట పడనిచ్చేది కాదు. చాడీలకు చెవి ఒగ్గేది కాదు. కానీ కిరణ్‌కు ఢిల్లీలో ఆ బలం లేదు. ఒక్క చిదంబరం తప్ప తతిమా అధిష్టాన నేతలంతా అంటీ ముట్టనట్లు వుంటున్నారు. జగన్‌ను అదుపు చేయలేకపోయాడని అసంతృప్తితో వున్నారు. ఎమ్మెల్యేలను కూడా ఆకట్టుకోలేక పోతున్నాడని నిందిస్తున్నారు. దానితో మంత్రులకు కూడా కిరణ్ అంటే భయం లేకుండా పోయింది.

## కోమటిరెడ్డి సవాళ్లు

ఓడరేవుల మంత్రి కోమటిరెడ్డి వెంకటరెడ్డి నేరుగా ముఖ్యమంత్రికి సవాళ్లు విసురుతున్నాడు. నువ్వెంత అంటే నువ్వెంత అని నిలదీస్తున్నాడు. ఆదిలాబాద్ జిల్లా కాంగ్రెస్ నేత ప్రేమసాగర్‌కు, కోమటిరెడ్డికి సరిపడదు. అయితే ముఖ్యమంత్రి మాత్రం ప్రేమసాగర్‌ను దగ్గరకు తీస్తున్నాడు. ఆ వత్తాసు మానుకోమని కోమటిరెడ్డి ముఖ్యమంత్రికి చెప్తే, అతడి దగ్గర ఒక ఎమ్మెల్యే వున్నాడు. అడిగిన పని చేయకుంటే ఇబ్బంది కదా అని సర్దిచెప్ప బోయాడట. దానితో కోమటిరెడ్డికి కోపం నసాళానికి అంటింది. వాడి దగ్గర ఒక ఎమ్మెల్యే వుంటే నా దగ్గర నలుగురు ఎమ్మెల్యేలు వున్నారు. నేను కూర్చోమంటే కూర్చుంటారు, నిల్చోమంటే నిలుచుంటారు. నేను తలచుకొంటే తెలంగాణలో సగం మంది ఎమ్మెల్యేలను కూడగట్టగలను. నీ అంతం చూడగలను అని బెదరించాడట. దానితో కిరణ్‌కుమార్ రెడ్డి తానే సర్దుకపోయి, వెంకన్నా, అంత కోపం వద్దని సముదాయించాడట. వైఎస్ హయాంలో రాష్ట్రాన్ని దోచిన రాజకీయవాదులలో కోమటిరెడ్డి ఒకడు. ఆయన వద్ద వందల కోట్ల ధనం వుంది. ఆ డబ్బులో కొంత విదిలిస్తే ఎమ్మెల్యేలు తన వెంట నడిచి వస్తారని ఆయన ధీమా.

## కడపలో దొంగ నాటకాలు

కడప ఎన్నికలలో జగన్‌ను ఓడించడం కిరణ్ కుమార్ రెడ్డికి తప్పనిసరి. అధిష్టానం కూడా ఆయన పనితీరును దాన్నిబట్టే అంచనా వేస్తున్నది. అందువల్లనే ఆయన మంత్రులను బ్రతిమలాడి, ప్రచారానికి పంపాడు. కానీ ఆ మంత్రులందరూ కడపలో దొంగ నాటకాలాడుతున్నారు. ఒక్కరిలో కూడా చిత్తశుద్ధి కన్పించడం లేదు. ఒకరిద్దరు మంత్రులైతే ఏకంగా జగన్‌కు లేదా ఆయన సన్నిహితులకు ఫోన్లు చేసి, రాయబారాలు పంపి, మంత్రులుగా తప్పదు కాబట్టి కడపకు వచ్చాము, మీకు నష్టం కల్గించే ఏ పని చేయమని బాసలు చేస్తున్నారు. మీరు మూడు లక్షల మెజార్టీతో గెలవాలని కోరుకొంటున్నామని ఒక మంత్రి మెహర్బానీ చూపితే, మీరు ముఖ్యమంత్రి అయ్యే సమయంలో మీరు వద్దన్నా మీ ఇంటిముందు వాలిపోతానని మరొక మంత్రి జగన్‌కు హామీ ఇచ్చాడట. కిరణ్ కుమార్ రెడ్డి పంపించాడు కాబట్టి వచ్చామే తప్ప, ఇక్కడ మేము చేసేదేమీ లేదని స్థానిక కాంగ్రెస్ వాదులతో నిర్మొగమాటంగా చెప్పేస్తున్నారు వారు. కనీసం పత్రికా సమావేశాలలో కూడా జగన్‌ను విమర్శించడానికి భయపడుతున్నారు.

## భవిష్యత్తు అయోమయం

ఈ పరిస్థితులు చూస్తుంటే కిరణ్‌కుమార్‌రెడ్డి రాజకీయ భవిష్యత్తు, కాంగ్రెస్ ప్రభుత్వం మనుగడ

కొరవ 14వ పేజీలో

### జగన్ ప్రభంజనంలో

# కాంగ్రెస్ ఆశలు గల్లంతు!

కడప ఉప ఎన్నికలతో వైఎస్.జగన్ చీకాకును శాశ్వతంగా వదలించుకోవాలన్నది కాంగ్రెస్ కోరిక. ఇక్కడ ముఖ్యమంత్రి నుంచి అక్కడ సోనియమ్మ వరకు కాంగ్రెస్ నేతలందరి ఆశ అదే. ఓడించడం లేదంటే మెజార్టీ తగ్గించడం ద్వారా జగన్‌ను రాజకీయ భూస్థాపితం చేయాలన్నది వ్యూహం. అందుకోసం గత నెల రోజుల నుంచి నిద్రాహారాలు మాని పని చేస్తున్నాడు కిరణ్‌కుమార్ రెడ్డి. బలమైన అభ్యర్థి, కావాల్సినంత డబ్బు, మంత్రుల మందీ మార్భలం, పోలీసు అండ, అధికారుల సహాయం, అధికార ప్రలోభాలు... అదీ ఇదీ అని ఏమిటి, తన చేతిలో వున్న అస్త్రాలన్నిటినీ ప్రయోగిస్తున్నాడు. చివరకు జగన్‌కు స్వయాన పినతండ్రి అయిన వైఎస్.వివేకానందరెడ్డిని తమ పక్షంగా రంగంలోకి దింపాడు. ఇంతకంటే ఒక ముఖ్యమంత్రి, ఒక రాజకీయ పార్టీ ఎన్నికలలో చేయగల్గిన, చేయదగిన పని ఏదీ వుండదు.

కానీ ఇన్ని చేసినా కాంగ్రెస్ ఆశలు గల్లంతయ్యే సూచనలు తప్ప, నెరవేరే అవకాశాలు కన్పించడం లేదు. ఈ నేతలు విస్మరించిన ఒకే ఒక అంశం వైఎస్ సానుభూతి. రాష్ట్రానికి వైఎస్ ఎటువంటి వాడైనా, కడప జిల్లాకు మాత్రం ఆయన దేముడంతటి వాడు. అభివృద్ధి పనుల ద్వారా కడప జిల్లా వాసుల జీవన విధానాన్ని, ప్రమాణాలను మార్పు చేసినవాడు. అటువంటి నేత చనిపోయిన తర్వాత జరిగే మొదటి ఎన్నికలో, ఆ జిల్లా ఓటర్లు ఆయనకు తప్ప వేరొకరికి ఓటు వేయడం జరిగే పనేనా? రాజకీయ నేతల మరణం తర్వాత జరిగే ఎన్నికలలో సానుభూతి పవనాలు ఎంత దట్టంగా ప్రసరిస్తాయో మనకు ఎన్నోసార్లు అనుభవమైంది. ఆ నిజాన్ని విస్మరించి ఎన్నికల వ్యూహం రూపొందించడం ద్వారా

కొరవ 14వ పేజీలో

# చిక్కుల్లో అవినీతి నేతలు

అవినీతిపై అన్నా హజారే ఉద్యమం ఇంకా శైశవ దశలోనే వున్నప్పటికీ, నీతి తప్పిన నేతలకు చేటుకాలం మొదలైపోయింది. 2జి స్పెక్ట్రం, కామన్‌వెల్త్ గేమ్స్ వంటి కుంభకోణాలలో సుప్రీంకోర్టు నేరుగా దర్యాప్తు పర్యవేక్షణకు పూనుకోవడంతో దేశాన్ని కొల్లగొట్టిన రాజకీయవాదులు ఒకరొకరుగా శ్రీకృష్ణ జన్మస్థానం చేరుకొంటున్నారు. కొందరు చట్టాలను తప్పించుకోగల్గుతున్నా, జనంలో మాత్రం ముఖం చూపించలేని అవమానకర పరిస్థితి ఎదుర్కొంటున్నారు.

కామన్‌వెల్త్ గేమ్స్ నిర్వాహకుడు సురేష్ కల్మాడీ కాంగ్రెస్ పార్టీలో చాలా పలుకుబడి కల్గిన నాయకుడు. అందువల్లనే ఆ ఆటల పోటీలలో దారుణమైన అవినీతి వెల్లువెత్తిందని లోకం కోడై కూసినా సాక్షాత్తు ప్రధానమంత్రే ఆయనకు రక్షణగా నిలిచాడు. ఏన్నార్ధంపాటు అతడి పదవులను కాపాడాడు. కానీ నిదానంగానే అయినప్పటికీ సిబిఐ చేసిన దర్యాప్తులో సాక్ష్యాధారాలు దొరకడంతో జైలుకు పంపక తప్పలేదు. తమిళనాడు రాజకీయాలలో ఆది కుటుంబంగా యాభై ఏళ్లపాటు భాసిల్లిన కరుణానిధి కుమార్తె కనిమొళి, భార్య దయాళు సిబిఐ వలలో చిక్కుకొన్నారు. 2జి స్పెక్ట్రం కుంభకోణంలో కొల్లగొట్టిన వేల కోట్ల నిధులలో 200 కోట్ల రూపాయలను తమ స్వంత టీవీ ఛానల్‌కు మళ్లించిన నిజం రుజువులతో సహా బయటపడి పోవడంతో, వారిద్దరినీ నిందితులుగా పేర్కొన్నది దర్యాప్తు సంస్థ. ఈ రోజు కాకుంటే రేపు కరుణానిధి కుమార్తె జైలు కమ్ములు లెక్క పెట్టబోతున్నది. కరుణానిధి భార్యను మాత్రం వయస్సు రీత్యా కనికరించి, వదలి పెట్టారు.

జమీన్‌రైతు

మహారాష్ట్ర రాజకీయాలలో ఉక్కు మనిషిగా, అభినవ ఛత్రపతి శివాజీగా పేరుపొందిన కేంద్ర వ్యవసాయ మంత్రి శరద్‌పవార్ పరిస్థితి చూస్తే జాలేస్తున్నది. ప్రధానమంత్రిత్వానికి అతి దగ్గరగా వచ్చిన నేత శరద్‌పవార్. అదృష్టం కలిసి రాక వెనుకబడ్డాడు. కానీ లేకుంటే రాజీవ్‌గాంధీ చనిపోయిన సమయంలోనే ఆ వున్నతస్థానం అధిష్టించవలసినవాడు. మహారాష్ట్రకు ఒకటికి నాలుగుసార్లు ముఖ్యమంత్రిగా పని చేశాడు. కానీ ఇప్పుడు తనపై వెల్లువెత్తుతున్న అవినీతి ఆరోపణలకు జడిసి, జనానికి కనపడకుండా ముఖం చాటు చేసుకోవాల్సిన దుర్గతితో కొట్టుమిట్టాడుతున్నాడు. అన్నా హజారే ఆయన్ను అవినీతికి సంకేతమని వేలెత్తి చూపినప్పటి నుంచి శరద్ పవార్ రాజకీయ ప్రతిష్ట మంట కలిసి పోయింది. తన కూతురు, అల్లుడులను సంతోష పెట్టడానికి ఆయన చేసిన పనులు ఇప్పుడు మెడకు చుట్టుకొన్నాయి. అవి చట్టానికి చిక్కేవి కాక పోవచ్చు. కానీ అవసాన దశలో జనం చేతికి మాత్రం చిక్కిపోయాడు. జై కొట్టించుకొన్నవారి చేతనే ఛీకొట్టించుకొంటున్నాడు.

మహారాష్ట్రకు చెందిన మరొక మాజీ ముఖ్యమంత్రి అశోక్ చవాన్, రాజస్థాన్ ముఖ్యమంత్రి అశోక్ గెహ్లాట్ వంటివారు కూడా అవినీతి రొచ్చులో గొంతుల వరకు పూడుకపోయి వున్నారు. వారి దోపిడీ కథలు ఆయా రాష్ట్రాలలో విస్తృత ప్రచారానికి వస్తున్నాయి. కర్నాటక ముఖ్యమంత్రి యడ్యూరప్పను ఆ రాష్ట్ర లోకాయుక్త చట్టం చట్రంలో బంధించడానికి ప్రయత్నం చేస్తున్నది.

అవినీతికి పాల్పడిన నేతలపైన ఇంత ఉధృత స్థాయిలో ఒత్తిడి రావడం మనకు తెలిసి గతంలో ఎప్పుడూ జరగలేదు. రాజకీయ అవినీతి జాతి మూలుగులను పీల్చి పిప్పి చేస్తున్న సమయంలో ఈ వార్తలు ప్రజలకు కొంతలో కొంత సంతృప్తి కల్గించడం ఖాయం. దేశ ప్రజలందరిలో రాజకీయవాదుల విచ్చలవిడి దోపిడీ పై తీవ్ర అసహనం, ఆగ్రహం వుంది. కానీ నేతలను ఏమీ చేయలేమన్న నిస్పృహ, ఏ చట్టమూ వారిని దొరకపుచ్చుకోలేదన్న నిరాశ జనంలో గూడు కట్టుకొని వున్నాయి. అందువల్లనే అవినీతిని సహించడం నేర్చుకొన్నారు మన ఓటర్లు. అవినీతిపరులని తెలిసి కూడా ఓటు వేస్తున్నారు. ఓటుకు నోటు తీసుకొని వారి అవినీతిలో భాగం పంచుకొంటున్నారు.

అటు అన్నా హజారే, ఇటు సుప్రీంకోర్టుల పుణ్యంగా అయినా సాధారణ ప్రజలలో అవినీతి నేతల పట్ల మార్పు వస్తుందేమో అన్న ఆశ ఒకటి వుంది. రాజకీయవాదికి జైలు శిక్ష కంటే ప్రజా తిరస్కరణ అధిక బాధ కల్గిస్తుందడం నిజం. చట్టాలతో వచ్చే చిక్కులను డబ్బు వెదజల్లి, న్యాయ కోవిదులను రంగంలోకి దింపి అధిగమించగలరు. కానీ ప్రజలు ఓటు వేయడం మాని వేస్తే ప్రజా జీవితం నుంచి పదవుల నుంచి బహిష్కృతులై పోతారు. అందువల్ల అవినీతి నేతల పట్ల ప్రజలు కఠిన వైఖరి అవలంబిస్తేనే రాజకీయ అవినీతి మరింత సులువుగా నిర్మూలన జరుగుతుంది. ఆ మంచి కాలం మనం త్వరలోనే చూస్తామని ఆశిద్దాము.

## జనవాణి

### బ్రాహ్మణులకు తగదు!

మనదేశంలో కొంత హేతువాదం ఉన్నప్పటికీ, పౌరోహితులు, ఆలయాలు అంటే ఎంతో గౌరవం వుంది. దాన్ని కాపాడవలసిన బాధ్యత బ్రాహ్మణుల మీద వుంది. ఈ మధ్య కొంతమంది పౌరోహితులు రాజకీయ వివాదంలో చిక్కుకొని ఒక నాయకుడి దిష్టి బొమ్మను, మొండెంకు శవదహనం గావించి పిండ ప్రదానం జరపడం జరిగింది. ఇది మన సంస్కృతి కాదు. పవిత్రమైన గర్భగుడిలో అపవిత్రత జరిగితే శుద్ధిచేసి గాని పూజలు నిర్వహించరు. అట్టి పౌరోహితులు దిష్టి బొమ్మలు, శవదహనం, పిండ ప్రదానం చేసిన బ్రాహ్మణులు ఏ విధంగా పూజలు చేయడానికి, పౌరహిత్యం చేయడానికి అర్హులవుతారు? బతికి వున్నవారికి పిండ ప్రదానం చేయడం బ్రాహ్మణులకు సబబేనా?

టి.వెంకటకృష్ణారెడ్డి హైదరాబాద్

### విప్రులను విభజించవద్దు!

కెసిఆర్ తన సిద్ధాంతాలను ప్రచారం చేసుకోవచ్చు. ఇబ్బంది లేదు. అయితే ప్రచార సాధనాల ముందు నోటికొచ్చినట్లు మాట్లాడడం తప్పు. ఆంధ్రా బ్రాహ్మణులని, తెలంగాణ బ్రాహ్మణులని విభజించి పాలించాలని చూడడం మంచిది కాదు. సర్వజనుల సుఖాన్ని కోరుకొనే బ్రాహ్మణులను బ్రిటీష్ వారిలా విభజించిన ఘనత కెసిఆర్‌కే దక్కింది. రాజకీయ అండ వుండే మరే కులం వారినైనా కెసిఆర్ ఈ విధంగా మాట్లాడి వుండేవారా?

కె.సుబ్రహ్మణ్యపంతులు కావలి

### హైదరాబాదే నయం!

నెల్లూరు నగరంలో కూరగాయల ధరలు, తూకంలో మోసాల వంటివి 'జమీన్‌రైతు'లో చదువుతూ వుంటే హైదరాబాదే ఈ విషయంలో చాలా నయంగా వుందని భావించక తప్పదు. ఎన్నోసార్లు హైదరాబాద్‌లో కన్నా నెల్లూరులో కూరగాయలు చాలా ఎక్కువ ధరలకు అమ్మడం విస్మయాన్ని కల్గిస్తోంది. పైగా నెల్లూరులో కూరగాయలు అమ్మే వర్తకులు వినియోగదారులను సూటిపోటి మాటలతో ఏడ్పించడమే గాక అప్పుడప్పుడు భౌతికదాడులకు పాల్పడుతుండడం ఆశ్చర్యాన్ని కల్గిస్తోంది. కూరగాయల మార్కెట్‌ను జిల్లా అధికారులు నియంత్రించలేరా?

ఎన్.మధుసూదనరావు హైదరాబాద్

### భారతీయ సంస్కృతి జయహో!

మొన్న ఒక దేవత ఊరేగింపు చూశా. దేవత ఊరేగింపులో మేళతాళాలు మామూలే. ఇందులో మన సంస్కృతి – భారతీయ సంస్కృతి కనపడింది. భారతి అంటే భారతదేశంలో జ్ఞానులు తప్ప కులమతాలు లేవనేది. ఎట్లంటే అమ్మవారి

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

2-5-1941
పేజీలు : 12 వెల: అణా

### ఈ స్వామి ఎవరు?

నెల్లూరు జిల్లా బోర్డు ఉపాధ్యాయుల్లో 75 రూపాయలు జీతం తీసుకొనే ఒక స్వామి ప్రతివూరా అప్పుల పుట్టలు పెడుతూ తోటి ఉపాధ్యాయుణ్ణి 0–0–6 కాఫీకి ఇప్పుడే మంచినీళ్లు తాగొస్తున్నా దేహి అంటాడు. ఈ స్వామి ఎవరో చెప్పగలరా?

### వెంకటగిరి తాలుకా వార్తలు

అధికారి ఎంత బెదిరించినా వైశ్యశ్రీ బెదురుకోనూ లేదు, టిక్కెట్టూ కొననూ లేదు సెబాస్.

అయ్యా, ఆ బొబ్బిలి యుద్ధంలో ధైర్యంగా ఢీకొని వీరస్వర్గం అలంకరించి ఇంకా కీర్తి వెన్నెలలు కాయిస్తున్నారే. ఆబే రామక్క మున్నగు వైశ్య యువతులు మీకేం కావలె?

***

అబ్బా చివరకు డాక్టరు ట్రాన్సఫరు అయినాదండీ?

### నెల్లూరు ముచ్చట్లు

### ఛైర్మన్ చెంగన్న

చెంగన్నా తప్పు చేశావు. పార్టీతో ఆలోచించకుండా లోకల్ బోర్డు ఇన్‌స్పెక్టరు గబ్బుదొరకెందుకు టీ పార్టీ యిచ్చావ్?

## 50 ఏళ్ల క్రితం ఈవారం

28-4-1961
పేజీలు: 12 వెల: 0–20 న.పై

### బదరీనాథ్ యాత్ర

రోడ్డు నిర్మాణం కారణంగా బదరీనాథ్‌కు పోయే యాత్రీకుల ప్రయాణ సౌకర్యం కష్టసాధ్యమని; దండీలు; గుర్రాలు, కంచర గాడిదలు లభ్యం కావని; ఈ అసౌకర్యాన్ని గుర్తించవలసిందిగా ప్రభుత్వం యాత్రీకులను హెచ్చరిస్తున్నది. బదరీనాథ్ యాత్రకు మే నుండి మంచి సీజనట.

భారతీయ యాత్రీకులు టిబెట్‌లోని కైలాస్, మానససరోవరములకు పోవుటకు చైనా ప్రభుత్వం అనుమతించిందట.

### కొత్త సమితులలో ఏ.సి వర్గం విజయం

క్రొత్తగా వచ్చిన బాలిరెడ్డిపాళెం, కావలి పంచాయతీ సమితులలో గూడా ఏ.సి.సుబ్బారెడ్డి వర్గం విజయం పొందింది. నెల్లూరు జిల్లా రాజకీయాలలో తన ఆధిక్యతను రుజువు చేసే ఈ ఫలితాలు, రాష్ట్ర రాజకీయాలలో ఏ.సికి బలాన్ని చేకూర్చగలవు.

బాలిరెడ్డిపాళెంలో నల్లపరెడ్డి చంద్రశేఖర్‌రెడ్డి వర్గానికి చెందిన ఆర్గురు – 20 ఓట్ల మెజారిటీతో ఎన్నికైనారు. ఈ సమితి కోఆప్షన్ 22వ తేది జరిగింది. ఈ సమితి ఎన్నికలో ఏ.సి.సుబ్బారెడ్డి వగైరాల ప్రమేయం లేకుండా, కేవలం చంద్రశేఖర్‌రెడ్డి స్వంత పలుకుబడి మీద విజయం కలుగడం; వీరికి వ్యతిరేకంగా జిల్లా స్వతంత్ర పార్టీ అధ్యక్షుడు స్వయంగా తీవ్రంగా పనిజేసి విఫలుడు గావడం; జిల్లా జన సంఘం మాజీ అధ్యక్షుడు సూరారెడ్డి రేపు సమితి అధ్యక్ష స్థానానికి ప్రత్యర్థి అయిన కాటంరెడ్డి రాజారాంరెడ్డి ఓడిపోవడం గమనార్హమైన కొన్ని అంశాలు.

# నెల్లూరు ముచ్చట్లు

## కలెక్టర్ బాధ్యతల స్వీకరణ

జిల్లా కలెక్టర్‌గా బి.శ్రీధర్ 22వ తేది ఉదయం ఇన్‌ఛార్జ్ కలెక్టర్ సౌరభ్ గౌర్ నుంచి బాధ్యతలు తీసుకొన్నారు. గుడ్‌ఫ్రైడే రోజు బాధ్యతలు తీసుకొన్న ఈయన జిల్లాకు 89వ కలెక్టర్. కడప జిల్లా ప్రొద్దుటూరు స్వస్థలం. గ్రూప్ వన్ పరీక్షలో ఎంపికై తూర్పుగోదావరి, రంగారెడ్డి జిల్లాల్లో ఆర్డీఓగా, డిఆర్వోగా, కర్నూలు జాయింట్ కలెక్టర్‌గా పని చేశారు. విశాఖపట్నం నగరాభివృద్ధి సంస్థ (ఉడా) విసీగా పనిచేస్తూ నెల్లూరుకు బదలీ అయ్యారు. 1998లో ఐఎఎస్ హోదా పొందారు. మంచి అధికారిగా పేరున్న ఈయన నెల్లూరులో మరింత పేరు తెచ్చుకోవాలని ఆశిద్దాం.

## డిఆర్వోగా రామిరెడ్డి

జిల్లా రెవిన్యూ అధికారిగా బి.రామిరెడ్డి 24వ తేది బాధ్యతలు స్వీకరించారు. రామిరెడ్డి జిల్లాకు పాత కాపు. పలుచోట్ల ఎమ్మార్వోగా, కలెక్టరేట్ పరిపాలనాధికారిగా, జడ్పీ సిఇఓగా పని చేసిన అనుభవముంది. డిఆర్వోగా ఆయన రాణించగలరని విశ్వసిస్తున్నాము.

పాత డిఆర్వో జయరామయ్యకు ఎక్కడా పోస్టింగ్ ఇవ్వలేదు. సిటీ కాంగ్రెస్ అధ్యక్షుడు చాట్ల నరసింహారావు ద్వారా ఆయన నెల్లూరులోనే పోస్టింగ్‌కు ప్రయత్నాలు చేస్తున్నట్లు తెలిసింది.

## కార్పొరేషన్ కార్యాలయం మార్పు

పాత కార్పొరేషన్ కార్యాలయం నుంచి కొత్త కార్పొరేషన్ కార్యాలయంలోనికి 27వ తేది మారాలనుకొన్నా ఈ నిర్ణయాన్ని మే మొదటి వారాంతానికి వాయిదా వేసుకొన్నట్లు కమిషనర్ డాక్టర్ టి.ఎస్.ఆర్.ఆంజనేయులు చెప్పారు.

## విద్యుత్ కోత లేదు

ట్రాన్స్‌కో అధికారులు గ్రామీణ, పట్టణ ప్రాంతాలలో విధిస్తుండిన విద్యుత్ కోతను 23వ తేది నుంచి ఎత్తి వేశారు. దీన్నిలా సాగిస్తారో మళ్లీ కోత విధిస్తారో ఆ ట్రాన్స్‌కో ఎస్‌ఇ నందగోపాల్‌కే ఎరుక?

## సండే మార్కెట్‌లో రగడ

నెల్లూరు సండే మార్కెట్‌లో దుకాణాలు మూసే విషయమై ఇరు వర్గాల మధ్య రేగిన రగడ దాడులు చేసుకొనే వరకు వెళ్లింది. సండే మార్కెట్‌కు ప్రతి శుక్రవారం సెలవు. దీన్ని మంగళవారానికి మార్చే విషయమై మార్కెట్ నాయకులు, ఇక్కడ షాపు నిర్వహించే నాగేంద్ర మధ్య విబేధాలు చోటుచేసుకొని ఇరు వర్గాలు పరస్పర దాడులకు దిగడంతో జనం భీతిల్లి పోయారు. సండే మార్కెట్‌లో వ్యాపారాలు నిర్వహించే వారిని పోలీస్ కౌన్సిలింగ్ చేయాల్సిన పరిస్థితి వుంది.

## రామనారాయణను కలసిన కలెక్టర్

కలెక్టర్‌గా బాధ్యతలు తీసుకొన్న బి.శ్రీధర్ 26వ తేది ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డిని మర్యాదపూర్వకంగా కలిశారు. ఈ సందర్భంగా మంత్రి నివాసంలో జంట ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్ కృష్ణారెడ్డి కూడా వుండినారు.

## దొంగలను పసిగట్టే జాగిలం

నెల్లూరు పోలీస్ శాఖలో దొంగలను పసిగట్టే జాగిలం ట్రాకర్ విధుల నిర్వహణకు సిద్ధంగా వుంది. జ్యూలీ అనే నామ ధ్యేయం గల ఈ శునకరాజం హైదరాబాద్‌లో ప్రత్యేక శిక్షణ అనంతరం ఇక్కడకు వచ్చింది. హత్యలు, దొంగతనాలు ఛేదించడంలో దీనికి మంచి ట్రాక్ రికార్డు వుంది. జిల్లా పోలీస్ శాఖలో ఇప్పటికి మూడు జాగిలాలున్నా ఇవి బాంబులను మాత్రమే పసిగట్టగల నైపుణ్యం గలవి.

## డాక్టర్ మధుసూధన శాస్త్రి శాంతి సందేశం!

క్యూబాలో జరిగే ప్రపంచ శాంతి సంఘం కార్యవర్గ సమావేశంలో సందేశం ఇచ్చేందుకు నెల్లూరులో సీనియర్ డాక్టర్ పి.మధుసూధన శాస్త్రికి ఆహ్వానమందింది. భారతదేశం నుంచి ఈ సభకు వెళ్తున్న ఏకైక ప్రతినిధి ఆయన. ఈ నెల 25వ తేది క్యూబా బయలుదేరి వెళ్లిన ఆయన మే 10వ తేది తిరిగి నెల్లూరు వస్తారు. డాక్టర్ మధుసూధన శాస్త్రి ప్రస్తుతం అఖిల భారత శాంతి సంఘం నెల్లూరు జిల్లా అధ్యక్షునిగా వ్యవహరిస్తున్నారు.

## వర్షం

21, 22 తేదీల్లో నెల్లూరు, నాయుడుపేట, గూడూరు, ఆత్మకూరు, ఉదయగిరి, కావలి ప్రాంతాల్లో ఓ మోస్తరు జల్లులు పడ్డాయి. అప్పటి నుంచి ఎండ తీక్షణత మరింత పెరిగింది.

## ముగిసిన స్పాట్

నెల్లూరు రంగనాయకులపేటలోని సెయింట్ పీటర్స్ స్కూల్‌లో జరుగుతుండిన పదవ తరగతి పరీక్షా పత్రాల మూల్యాంకనం 24వ తేది ముగిసింది. మొత్తం మీద ఇక్కడ 5,25,463 జవాబు పత్రాల మూల్యాంకనం చేశారు. 1309 మంది సిబ్బంది దీనిలో పాల్గొన్నారు.

## ఇంటర్నెట్ కేంద్రాలపై పోలీసు దాడులు

నెల్లూరు నగరంలో విద్యార్థులు ఎక్కువగా వుండే విఆర్‌సి, హరనాథపురం, మద్రాస్ బస్టాండ్ ప్రాంతాలలోని ఇంటర్నెట్ కేంద్రాలు, సిడి, డివిడి దుకాణాలపై పట్టణ సిఐ వీరాంజనేయరెడ్డి నేతృత్వంలో పోలీసులు దాడులు జరిపారు. విచిత్రంగా ఈ దాడుల విషయం ఈ కేంద్రాల వారికి ముందుగా తెలిసి జాగ్రత్త పడడం వల్ల పోలీసులకు ఏమీ దొరకలేదు.

## లయన్స్ క్లబ్ గవర్నర్‌గా డిఎస్ కుమార్!

లయన్స్ క్లబ్ ఆఫ్ ఇంటర్నేషనల్ జిల్లా గవర్నర్‌గా నెల్లూరీయుడు లయన్ డిఎస్ కుమార్ ఎన్నికయ్యారు. కడపలో 24వ తేది జరిగిన ఎన్నికల్లో లయన్ డిఎస్ కుమార్‌కు 77 శాతం ఓట్లు వచ్చాయి. లయన్ గవర్నర్ పదవి పరిధిలోనికి నెల్లూరు, ప్రకాశం, గుంటూరు, కడప, కర్నూలు, అనంతపూర్ జిల్లాలు వస్తాయి. 2012 వరకు ఆయన ఈ పదవిలో వుంటారు. నెల్లూరు పినాకినీ లయన్స్ క్లబ్ స్థాపకుడిగా కుమార్ గణనీయమైన సామాజిక సేవలందించారు.

## డిఎస్పీ పోస్టుకు పైరవీలు

నగర డిఎస్పీ రాధికపై బదలీ వేటు పడడంతో ఆ స్థానానికి రావడానికి పలువురు తమ ప్రయత్నాలు ముమ్మరం చేశారు. ప్రస్తుతం కావలి డిఎస్పీ శ్రీనివాసులురెడ్డి ఇన్‌ఛార్జ్‌గా వ్యవహరిస్తున్నా ఈ పోస్టుకు రావడానికి రాజకీయంగా తనకున్న పలుకుబడిని ఉపయోగిస్తున్నట్లు సమాచారం. ఆత్మకూరు డిఎస్పీ సిద్ధారెడ్డి మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఆశీస్సులు కోరగా, నెల్లూరులో ఇంతకు మునుపు ఎస్‌ఐగా కరకుగా పనిచేసిన నవాబ్‌జాన్ కూడా ప్రయత్నిస్తున్నట్లు తెలిసింది.

## మే 20న కళ్యాణమస్తు!

తిరుమల తిరుపతి దేవస్థానం రాష్ట్రవ్యాప్తంగా చేపట్టిన కళ్యాణమస్తు ఆరవ విడత కార్యక్రమాన్ని మే 20వ తేది నిర్వహిస్తున్నారు. జిల్లాలోని అన్ని నియోజకవర్గ కేంద్రాలలో జరిగే ఈ కార్యక్రమంలో వివాహం చేసుకోదలచిన జంటలు తమ దరఖాస్తులను మే 15వ తేదీలోగా తహశీల్దార్ కార్యాలయాల్లో అందజేయాలి.

## చిరంజీవి చరిత్ర హీనుడు

రాజకీయ పార్టీ స్థాపించి దానిని పదవుల కోసం కాంగ్రెస్ పార్టీలో విలీనం చేసిన చిరంజీవి చరిత్ర హీనుడిగా మారాడని ప్రముఖ విలన్, 'గజా'గా పేరుగాంచిన ఆనంద్‌రాజ్ విమర్శించాడు. సూళ్లూరుపేట చెంగాళమ్మ దర్శనానికి వచ్చిన ఆయన మాట్లాడుతూ ఈ వ్యాఖ్యలు చేశారు. సొంత ఊరిలో గెలవలేని చిరంజీవి తగుదు నమ్మా అంటూ తమిళనాడు ఎన్నికల ప్రచారానికి రావడం సిగ్గు చేటన్నారు.

ప్రేమను ప్రేమించు ప్రేమకై అన్న

**- మహనీయుని నిర్యాణం -**



ఎంతో మందికి ఎన్నో వ్యధలను,
బాధలను తొలగించి,
చూపులతోనే మన:స్థైర్యాన్ని కలుగజేసి,
ప్రాణం నిలిచేందుకు అవసరమైన
తీర్థం కొన్ని కోట్ల మందికి పంచి,
దేవుడి ప్రసాదం (దేవుడు మనకు
ఒప్పజెప్పిన పనులు) ఆచరించే ఈ
శరీరాన్ని అన్ని రుగ్మతుల నుండి
కాపాడేందుకు వైద్య సహాయం
అందించి – శాంత స్వభావంతో,
ప్రేమతత్వంతో తన జీవితాన్ని
మానవకోటికి అర్పించిన
మహనీయునికి నివాళులర్పిస్తూ...
న్యాయా న్యాయాల్ని తులాభారం
చేసే ***ఓ దేవ దేవా*** ఆ మహనీయుని
నాలుగువారాలు కష్టపెట్టావు కదయ్యా
ఇది నీకు భావ్యమా?

**తూపిలి వనమాలి**

## కోట్ల రూపాయల టోపీ

నమ్మకంగా బియ్యం వ్యాపారం చేస్తూ నట్టేట ముంచిన బియ్యం వ్యాపారి వైనం ఇది. స్టోన్‌హౌస్‌పేటకు చెందిన శ్రీరాం శ్రీనివాస్ గత కొన్నేళ్లుగా బియ్యం వ్యాపారం చేస్తున్నాడు. వున్నట్లుండి 1.50 కోట్ల రూపాయలు టోకరా వేసి రాత్రికి రాత్రి ఉడాయించాడు. ఈ విషయం తెలుసుకొన్న రైస్‌మిల్లర్లు గగ్గోలు పెడుతున్నారు తప్ప పోలీసులకు ఫిర్యాదు చేయలేదు.

## ఆర్యవైశ్య మహాసభ కార్యదర్శిగా చలమయ్య!

నెల్లూరులో ప్రముఖ వైశ్యనాయకుడు కెవిచలమయ్య ఆంధ్రప్రదేశ్ ఆర్య

కొరవ 14వ పేజీలో


జిల్లా అధికారులతో కొత్త కలెక్టర్ సమీక్షా సమావేశం.

# ఆకట్టుకొంటున్న కలెక్టర్!

## వ్యవహారశైలి - పనితీరు వేరు!

కొత్త కలెక్టర్‌గా బాధ్యతలు తీసుకొన్న బి.శ్రీధర్ వ్యవహారశైలి వేరుగా వుంది. జిల్లాకు రాకముందే ఇక్కడి సమస్యలపై ఒక అవగాహనకు వచ్చిన ఆయన బాధ్యతలు తీసుకొన్న రెండవ రోజే నెల్లూరు రైతులు దీర్ఘకాలంగా ఎదుర్కొంటున్న గిట్టుబాటు ధర, ధాన్యం నిల్వ చేసేందుకు అవసరమైన గోడౌన్లపై జిల్లా అధికారులతో సుదీర్ఘ సమావేశం జరిపారు. ఈ సమావేశంలో ఆయన చేసిన సూచనలు, సలహాలు పలువురి అధికారులను ఆశ్చర్యపరిచాయి. సమావేశంలో ఆయన మాట్లాడుతూ రైతులు పండించిన ధాన్యానికి ఖచ్చితంగా మద్దతు ధర కల్పించి వారిని ఆదుకోవాలి. అవసరమైన ప్రాంతాల్లో కొనుగోలు కేంద్రాలు ఏర్పాటు చేయండి. లెవీ బియ్యాన్ని నిల్వచేసేందుకు అవసరమైన గోదాములు నిర్మించేందుకు చర్యలు తీసుకోండి. గోదాములు నిర్మించేందుకు ముందుకు వచ్చిన రైతులను, రైస్‌మిల్లర్లను ప్రోత్సహించాలన్నారు. ఎఫ్‌సిఐ గోదాముల్లో నిల్వ సామర్థ్యం పెంచేందుకు చర్యలు తీసుకోవాలని ఆదేశించారు. రైతులకు మద్దతు ధర కల్పించేందుకు రెవిన్యూ, సివిల్ సప్లయ్ అధికారులతో కలసి సమన్వయంగా పనిచేయాలని సూచించారు. అనంతరం కలెక్టర్ భూసేకరణపై అధికారులతో మరో సమావేశం నిర్వహించారు. ఎప్పుడో కండలేరు, సోమశిల, స్వర్ణముఖి కాల్వల అభివృద్ధికి భూములు సమర్పించిన లబ్ధిదారులకు వెంటనే నష్టపరిహారం చెల్లించేందుకు చర్యలు తీసుకోవాలని సూచించారు. సమావేశంలో జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్, సివిల్ సప్లయ్ డిఎం ప్రభాకరరావు, తెలుగుగంగ భూసేకరణ స్పెషల్ డైరక్టర్ భానుప్రసాద్, డిఆర్వో జయరామయ్య, జడ్పీసిఇఓ రామిరెడ్డి, నెల్లూరు, గూడూరు, కావలి ఆర్డీఓలు వేణుగోపాల్‌రెడ్డి, రామ్మూర్తి, వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.

# జయంతికి రాని అధికార గణం!

ఈ నెల 14వ తేదీ అంబేద్కర్ జయంతి సందర్భంగా అన్ని శాఖల మండల స్థాయి అధికారులు కార్యక్రమాలలో పాల్గొనాలన్న ప్రభుత్వ ఆదేశాలను కొందరు అధికారులు పాటించలేదు. నగరంలో కస్తూర్బా కళాక్షేత్రంలో ప్రభుత్వం ఆధ్వర్యంలో నిర్వహించిన అంబేద్కర్ జయంతికి పలు శాఖల అధికారులు డుమ్మా కొట్టారు. ముందు రోజు కూడా సంబంధిత ఆర్డీఓలు వారి డివిజన్లలో

## రాజ్యాంగ నిర్మాతకు అవమానం

పనిచేసే వివిధ శాఖల అధికారులు అంబేద్కర్ జయంతి కార్యక్రమానికి హాజరు కావాలని ఆదేశించారు కూడా. అదే రోజు సెలవు దినం కావడంతో కొన్ని కార్యాలయాలు మూతపడ్డాయి. మంత్రి ఆనం రామనారాయణరెడ్డితోపాటు ఎమ్మెల్యేలు, జిల్లా కలెక్టర్ హాజరైనప్పటికీ మండలస్థాయి అధికారులతోపాటు కొందరు అధికారులు సైతం పత్తాలేకుండా పోయారు. కార్యక్రమానికి హాజరుకాని వారిపై ఎటువంటి చర్యలు తీసుకొంటారో వేచి చూడాలి.


చేపల మార్కెట్‌లో జరిగిన పనులను చూస్తున్న కలెక్టర్.

# పనులు పరిశీలించిన కలెక్టర్!

జిల్లాలో జరుగుతున్న అభివృద్ధి పనులు, ముఖ్య నిర్మాణాల ప్రగతిని ఎంత తీరికలేకున్నా జిల్లా కలెక్టర్ వెళ్లి చూస్తే ఆ తీరే వేరు. పాత కలెక్టర్ ఆ పద్ధతికి మంగళం పాడి వుండినారు. కొత్త కలెక్టర్‌గా బాధ్యతలు తీసుకొన్న బి.శ్రీధర్ 23వ తేది నగరంలో తిరిగి పలు అభివృద్ధి పనులను పరిశీలించారు. తొలుత కొత్తగా కట్టిన కార్పొరేషన్ కార్యాలయానికి వెళ్లి ప్రతి విభాగాన్ని ఆసాంతం పరిశీలించారు. బాగా కట్టించారంటూ మునిసిపల్ కమిషనర్ టిఎస్ఆర్ ఆంజనేయులు భుజం తట్టారు. నగరంలో కోట్లాది రూపాయలు వెచ్చించి నిర్మిస్తున్న చిల్డ్రన్స్ పార్క్, పడారుపల్లి, బాలాజీనగర్, ఆర్టీఓ ఆఫీసు, ముత్తుకూరు

## అధికారులందరికీ నిశ్శబ్ద సందేశం!

రోడ్ల పనులు ఆసాంతం చూశారు. దైకస్‌రోడ్డులో నిర్మించిన జలపుష్ప భవన్(చేపల మార్కెట్)ను సందర్శించిన కలెక్టర్ అక్కడి అధునాతన సౌకర్యాలను అక్కడి వ్యాపారులు, ప్రజలు సద్వినియోగం చేసుకొనేలా చర్యలు తీసుకోవాలని కమిషనర్‌కు సూచించారు. ఈ సందర్భంగా ఎన్నో ఏళ్లుగా పాతగుడ్డల వ్యాపారం చేసుకొంటున్న వ్యాపారులు తమకు షాపులు లేకుండా చేసిన విషయాన్ని కలెక్టర్ దృష్టికి తీసుకవెళ్లగా ఆయన ఈ సమస్య పరిష్కరిస్తానని హామీ ఇచ్చారు.

# జీడీ కానిస్టేబుళ్ల పీడ విరగడ

- వ్యవస్థను రద్దుచేసిన ఎస్పీ



పోలీస్ శాఖలో లైసెన్డ్ మాఫియాగా మారిన జీడీ కానిస్టేబుళ్ల వ్యవస్థను రద్దు చేస్తూ ఎస్పీ దామోదర్ జారీచేసిన ఉత్తర్వు ఆ శాఖలో ప్రకంపనాలు సృష్టించింది. ఎస్ఐలు, సిఐల వద్ద జనరల్ డ్యూటీలు చేస్తున్న కానిస్టేబుళ్ల ఆ విధులను వదలి చేయాల్సిన విధులు నిర్వహించమని తన ఉత్తర్వులో పేర్కొన్నారు. ప్రతి పోలీస్‌స్టేషన్‌లోనూ ఎస్ఐ వద్ద ఇద్దరు, సిఐ, డిఎస్పీల వద్ద ముగ్గురు కానిస్టేబుళ్లు జనరల్ డ్యూటీ పేరుతో విధుల్లో వుంటారు. వీరు ఎస్ఐ, సిఐ, డిఎస్పీల పేరు చెప్పి స్టేషన్‌ను బట్టి నెల నెలా లక్ష రూపాయలు దండేస్తుంటారు. ఒక రకంగా చెప్పాలంటే స్టేషన్ లోపల ఏ పని జరగాలన్నా వీరి హవా కొనసాగుతుంది. ఖాకీ డ్రస్ వేసుకోకుండా అన్ని పైరవీలు వీరు చేస్తుంటారు. జీడి కానిస్టేబుళ్లుగా పనిచేస్తున్న వారిని డిఎస్పీ, సిఐ, ఎస్ఐలు వదలరు. సాధ్యమైనంత వరకు వీరు బదలీ కాకుండా కాపాడుతుంటారు. నగర డిఎస్పీ కార్యాలయంలో వుండిన ఎనిమిది మంది జీడి కానిస్టేబుళ్లపై మొదట బదలీ అస్త్రం వేసిన ఎస్పీ ఆ తర్వాత అన్ని స్టేషన్లలోనూ దీన్ని అనువర్తింప జేశారు.

# నగర డిఎస్పీ వెళ్లిపోయింది!

## చుట్టుముట్టిన వివాదాలే కొంప ముంచాయి.

నెల్లూరు నగర డిఎస్పీ జీఆర్ రాధికారెడ్డిపై బదలీ వేటు పడింది. ఆమెను కరీంనగర్ పోలీస్ ట్రైనింగ్ కళాశాలకు బదలీ చేశారు. నెల్లూరులో 2009 జూలై నెలలో డిఎస్పీగా బాధ్యతలు తీసుకొన్న ఆమె ఎపిపిఎస్సీ పరీక్షల్లో నెగ్గి మరీ డిఎస్పీ పోస్టింగ్ పొందారు. నెల్లూరు ఆర్డీఓగా పనిచేస్తున్న వేణుగోపాల్‌రెడ్డి ఆమె బ్యాచ్‌కు చెందినవారు. తొలుత నగరంలో కరుకుగానే బాధ్యతలు నిర్వహించిన ఆమెకు బియ్యం, ఇసుక అక్రమ స్మగ్లర్ల నుంచి ఎదురుదెబ్బ తగిలింది. దీంతో బాగా కృంగిపోయారామె. ప్రేమించి పెళ్లి చేసుకొన్న భర్త ఆమెకు విధి నిర్వహణలో పలుమార్లు ప్రతిబంధకంగా మారారు. ఆయన కేసుల్లో చేసే పైరవీల వల్లే ఆమె గబ్బు పట్టాల్సి వచ్చింది. నెల్లూరు డిఎస్పీ ఆఫీసును ఎస్పీ బంగళాకన్నా సుందరంగా వసూళ్లు చేసి కట్టించిన విషయమై ఆమెపై తీవ్ర విమర్శలు రేగినా చర్యలు లేవు. చివరికి చెన్నైకు చెందిన ఒక చిన్న దొంగ శ్రీనివాస గణపతి నుంచి స్వాధీనం చేసుకొన్న బంగారం వ్యవహారం ఆమె మెడకు చుట్టుకొంది. విచారణలోనూ ఇది నిజమని తేలడం, ఎస్పీ దామోదర్‌కు, ఆమెకు కొన్నాళ్లుగా నడిచిన కోల్డ్‌వార్ బదలీ చేయించే స్థాయికి వెళ్లింది. ఆమెపై శాఖాపరమైన చర్యలకు చట్టపరంగా అవకాశాలు లేకపోవడంతో ఆమె డిస్మిస్‌పై రేగిన దుమారం సద్దుమణిగింది. లౌక్యంగా వ్యవహరించడంలో డిఎస్పీ విఫలం కావడం వల్ల ఆమెకు ఆమె పలు సమస్యలలో చిక్కుకొన్నారు.

# విద్యా వ్యాపారం

విద్యా వ్యాపారం జోరందుకొంది. మిగతా వ్యాపార సంస్థలు, వ్యాపారుల్లాగే విద్యను తమ లాభసాటి వ్యాపారంగా కార్పొరేట్ సంస్థలు మార్చినప్పటి నుంచి కొత్త పుంతలు తొక్కుతోంది. వేసవి సెలవులు ప్రకటించి వారం గడవక ముందే కళాశాలల యాజమాన్యాలు వారి తల్లితండ్రులను తమ వైపు తిప్పుకొని పిల్లలను వారి వారి కళాశాలల్లో చేర్పించుకొనేందుకు బ్రోకర్లను రంగంలోకి దించుతున్నారు. వీరికి ముద్దుగా పిఆర్వోలనే పేరు పెట్టారు. పదవ తరగతి పరీక్ష వ్రాసిన విద్యార్థుల వద్దకు వెళ్లి, వారి

## ఇంటింటికి పిఆర్వోలు, సిబ్బంది

తల్లితండ్రులను ఒప్పించి తమ కళాశాలల్లో చేరేలా చూడడం వీరి బాధ్యత. ఒక్కో విద్యార్థిని చేర్పించినందుకు వీరికి కమిషన్ అందిస్తారు కళాశాలల యాజమాన్యాలు. ఈ పిఆర్వోలుగా ప్రైవేటు విద్యాసంస్థల్లో పనిచేసే వారికంటే ప్రభుత్వ ఉపాధ్యాయులే అధికంగా వుండడం విశేషం. ప్రభుత్వ ఉద్యోగిగా బాధ్యతాయుతమైన ఉపాధ్యాయుడిగా వుంటూ ప్రభుత్వ పాఠశాలను బలోపేతం చేయడం కంటే కార్పొరేట్ సంస్థలు ఇచ్చే కాసులకు కక్కుర్తిపడి ఈ నీచానికి పాల్పడుతున్నారు. ఒకవైపు పాఠశాలలు ఎత్తివేస్తున్నారంటూ గోలచేసే అయ్యోర్లు పిఆర్వోలుగా అవతారం ఎత్తి ద్విపాత్రాభినయం చేస్తుండడం పట్ల సర్వత్రా విమర్శలు వ్యక్తం అవుతున్నాయి.

# తాగునీటి ఎద్దడిని ఎదుర్కోను
# ముందస్తు చర్యలేవీ?

**ప్రతి వేసవిలోనూ గ్రామీణ ప్రాంతాల్లోని ప్రజలకు మంచినీటి తిప్పలు తప్పడం లేదు. ఆర్‌డబ్ల్యుఎస్ అధికారులు ముందస్తు చర్యలు చేపట్టకపోవడం వల్ల ప్రతి ఏడాది ఈ సమస్య పునరావృతమవుతూనే వుంది.**



నెల్లూరు భక్తవత్సలనగర్‌లో త్రాగునీటిని ఆ ప్రాంతానికి వచ్చిన ట్యాంకర్ ద్వారా వంతుల వారీగా పట్టుకొంటున్న జనం.

వేసవి కాలం సమీపించడంతో జిల్లాలో తాగునీటి ఎద్దడి ఏర్పడే అవకాశం కనిపిస్తోంది. జిల్లావ్యాప్తంగా విస్తారంగా వర్షాలు కురిసినప్పటికి నీటిని నిల్వ చేసుకునే సౌకర్యం ఎక్కడా లేదు. సోమశిల రిజర్వాయర్‌లో ప్రతి సంవత్సరం తాగునీటి అవసరాల కోసం రెండు టిఎంసిల నీటిని నిల్వ వుంచుతారు. ఈ రెండు టిఎంసిల నీరు కేవలం నెల్లూరు నగర ప్రజల అవసరాలకే వినియోగిస్తారు. మిగిలిన మండలాల ప్రజలు బోర్లు, బావుల పైనే ఆధారపడాల్సి వస్తోంది. ఇటీవల కాలంలో తాగునీటి ఎద్దడి నివారణ కోసం గ్రామీణ నీటి సరఫరా విభాగం (ఆర్‌డబ్ల్యుఎస్) ఆధ్వర్యంలో సమ్మర్ స్టోరేజ్ ట్యాంకుల నిర్మాణానికి శ్రీకారం చుట్టింది ప్రభుత్వం.

కాంట్రాక్టర్ల నిర్లక్ష్యం, నిధుల కొరత కారణంగా జిల్లాలో కొన్ని సమ్మర్‌స్టోరేజ్ ట్యాంకుల నిర్మాణం అసంపూర్తిగానే మిగిలిపోయింది.

## పల్లెలకెంత కష్టం?

మరో ప్రక్క గ్రామీణ ప్రాంతాలలో తాగునీటి సమస్య ప్రజలను పట్టి పీడిస్తుంది. గ్రామ పంచాయితీల ఆధ్వర్యంలో తాగునీటి సరఫరా సక్రమంగా జరగడం లేదు. రెండు, మూడు రోజులకోసారి నీటిని సరఫరా చేస్తుండడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. మండలస్థాయి అధికారులతోపాటు, ప్రజాప్రతినిధులు సైతం త్రాగునీటి అవసరాల గురించి పట్టించుకోకుండా వదిలేస్తున్నారు. పంచాయితీ పరిధిలో వేసిన త్రాగునీటి బోర్ల నుంచి నీటి సరఫరా కోసం వినియోగించే మోటార్ల మరమ్మత్తులు చేస్తున్నారనో, లేకుంటే పైపులు పగిలిపోయాయనో ఏదో ఓ కుంటిసాకు చెబుతున్నారే తప్ప పైపులైన్ల ద్వారా తాగునీరు సరఫరా అవుతున్న గ్రామాల్లో ప్రత్యామ్నాయ మార్గాలను అన్వేషించడం లేదు.

ఇప్పటివరకు పట్టణ ప్రాంతాలకే పరిమితమైన తాగునీటి క్యాన్ల వ్యాపారం ప్రస్తుతం గ్రామీణ ప్రాంతాలకు పాకింది. ఇక్కడ త్రాగునీటి సరఫరా సక్రమంగా లేకపోవడం, ఒక వేళ పైపులైన్ల ద్వారా వచ్చిన నీరు కలుషితం కావడంతో త్రాగేందుకు వుపయోగపడడం లేదు. త్రాగునీటి క్యాన్ల వ్యాపారం చేసే కంపెనీలు ప్రజల అవసరాలను ఆసరా చేసుకొని వాహనాల ద్వారా నీటిని గ్రామీణ ప్రాంతాలకు తరలిస్తున్నారు. సకాలంలో త్రాగునీరు సరఫరా కాకపోవడం వల్ల తప్పనిసరి పరిస్థితుల్లో త్రాగునీటి క్యాన్లను కొనుగోలు చేసుకోవాల్సిన దుస్థితి ప్రజలకు ఏర్పడుతుంది. ప్రతి సంవత్సరం వేసవి కాలంలో తాగునీటి ఎద్దడి ఏర్పడుతున్న సంగతి అధికారులకు తెలిసినా తాత్కాలిక చర్యలు చేపడుతున్నారే తప్ప పూర్తిస్థాయిలో సమస్య పరిష్కారం కోసం కృషి చేయడం లేదు. జిల్లాలో తాగునీటి ఎద్దడి నివారణ కోసం కోట్ల రూపాయలు ప్రభుత్వం విడుదల చేస్తున్నా అవి సక్రమంగా వినియోగించబడడం లేదు. ఏప్రెల్, మే నెలల్లో తాగునీటి సమస్య మరింత తీవ్రంగా వుంటుంది. భూగర్భ జలాలు అడుగంటి బోర్లు, బావులలో నీరు లభ్యం కాకుండా పోతుంది. ఇటువంటి పరిస్థితులలో ట్యాంకర్ల ద్వారా సరఫరా చేసే నీటి కోసం మారుమూల ప్రాంతాల మహిళలు ఎంతో ఆశతో ఎదురు చూడాల్సి వస్తుంది.

## నీటిరవాణా పేరిట స్వాహా!

తాగునీరు అందించేందుకు అవసరమైతే ట్యాంకర్ల ద్వారా రవాణా చేయాలన్నది ప్రభుత్వ లక్ష్యం. ఇందుకోసం అధిక మొత్తంలో ప్రభుత్వం నిధులు విడుదల చేస్తుంటుంది. ట్యాంకర్ల ద్వారా నీటిని రవాణా చేసే విషయంలో సంబంధిత అధికారులు బాగానే చేతివాటం ప్రదర్శిస్తుంటారు. తక్కువ ట్రాక్టర్లను వినియోగించి ఎక్కువ ట్రాక్టర్లతో నీటిని సరఫరా చేసినట్లు రికార్డుల్లో నమోదు చేసి నిధులను స్వాహా చేస్తుంటారు. వేసవి కాలం కావడం, తాగునీటి అవసరాలు తీవ్రంగా వుండడంతో జిల్లా ఉన్నతాధికారులు నిధులు వినియోగం జరిగిందా లేదా అనేదాని గురించి పెద్దగా పట్టించుకోరు. దీంతో మండలస్థాయి అధికారులు ఇష్టానుసారంగా వ్యవహరిస్తుంటారు. ఈనెల నుంచి రాష్ట్రప్రభుత్వం తాగునీటి ఎద్దడి లేకుండా అన్ని చర్యలు చేపట్టాలని జిల్లా అధికార యంత్రాంగాన్ని ముందుగా అప్రమత్తం చేసింది.

ఇప్పటికే పలు మండలాల్లోని గ్రామపంచాయితీల పరిధిలో వున్న మేజర్ గ్రామాలకు పైపుల ద్వారా తాగునీటి సరఫరా సక్రమంగా అందకుండా పోయింది. ముత్తుకూరు, అల్లూరు, టిపి గూడూరు తదితర మండలాల్లో వేసిన బోర్లలో ఉప్పునీరు వస్తుందని ప్రజలు వాపోతున్నారు. దూర ప్రాంతం నుంచి పైపులైన్ల ద్వారా తాగునీరు సరఫరా సక్రమంగా అందకపోవడంతో అనేక అవస్థలు పడుతున్నారు. బోర్లలోని ఉప్పునీటిని ఇతర అవసరాలకు వినియోగిస్తున్న ప్రజలు తాగేందుకు వాటర్ క్యాన్లపై ఆధారపడుతున్నారు. గత్యంతరం లేక అధిక ధరలకు వీటిని కొనుగోలు చేస్తున్నారు. ప్రజల అవసరాన్ని ఆసరా చేసుకొంటున్న వాటర్‌ప్లాంట్ల నిర్వాహకులు దోపిడీకి పాల్పడుతున్నారు.

## మునిసిపాల్టీలలో...

నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్‌తోపాటు వెంకటగిరి, గూడూరు, కావలి మునిసిపాలిటీలలో నీటి ఎద్దడి ఏర్పడుతుంది. పై మునిసిపాల్టీలలో సమ్మర్ స్టోరేజ్ ట్యాంకుల నిర్మాణాలు పూర్తికాకపోవడంతో ఈ వేసవిలో ప్రజల దాహార్తిని ఎలా తీర్చాలన్న దానిపై అధికారులు తర్జన భర్జన పడుతున్నారు. పైపులైన్ల ద్వారా సరఫరా అయ్యే నీరు ప్రజల అవసరాలకు ఏమాత్రం సరిపడే పరిస్థితి కనిపించడం లేదు. ఈ నెలలోనే నెల్లూరు నగరంలో కార్పొరేషన్ అధికారులు మూడు రోజులకోసారి కొన్ని ప్రాంతాలకు త్రాగునీటిని సరఫరా చేస్తున్నారు.

సమ్మర్ స్టోరేజ్ ట్యాంక్ పనులు పూర్తయ్యాయని ప్రారంభోత్సవం కూడా పూర్తి చేశారు. కానీ ఇంకా ఈ పనులు జరుగుతూనే వున్నాయి. మరో ఆరు మాసాలకు కూడా సమ్మర్ స్టోరేజ్ ట్యాంక్ పూర్తవుతుందా అన్న ఆశాభావం కలగడం లేదు. దీని వల్ల ఈ ఏడాది కూడా పొదలకూరురోడ్డులో ఏప్రెల్ మాసాంతానికే మంచినీటి సమస్య మొదలైంది. ఏ రోజు ఏ సమయంలో మంచినీటిని వదులుతున్నారో అర్థం కాని అయోమయ స్థితి నెలకొని వుంది.

వీధి కొళాయిల వద్ద తాగునీటి కోసం మహిళలు గంటలకొద్ది వేచి వుండాల్సిన పరిస్థితి ఏర్పడింది. కావలి, వెంకటగిరి మునిసిపాల్టీలలో అయితే పరిస్థితి మరింత ఘోరంగా వుంటుంది. గూడూరు మునిసిపాల్టీలో ప్రస్తుత పరిస్థితి కొంత మెరుగ్గా వున్నప్పటికి రానున్న రెండు నెలల్లో క్షీణించే అవకాశం వుంది. కమిషనర్ తరచూ సమావేశాలు ఏర్పాటు చేసి తాగునీటి ఎద్దడి లేకుండా ముందస్తు చర్యలు తీసుకోవాలని క్రిందిస్థాయి సిబ్బందిని ఆదేశిస్తున్నారు. అవసరమైతే ఎక్కువ ట్రాక్టర్లను అద్దెకు తీసుకొని తాగునీటి సరఫరా చేయాలని నిర్ణయించారు.

ఇదిలా వుండగా గ్రామీణ ప్రాంతాలలో తాగునీటి ప్రాజెక్టులు నిర్మించిన గ్రామీణ నీటి సరఫరా విభాగం అధికారులు వీటి నిర్వహణ బాధ్యతలు స్థానిక గ్రామపంచాయితీలకు అప్పగించారు. మోటార్లు చెడిపోయినా, పైపులైన్లు పగిలిపోయినా వాటిని యుద్ధప్రాతిపదికన మార్చేందుకు పంచాయితీ నిధులు ఖర్చు చేయాల్సి వుంటుంది. అయితే గ్రామపంచాయితీ సర్పంచ్, కార్యదర్శులు మాత్రం ఆర్‌డబ్ల్యుఎస్ విభాగంపై నెట్టి వేస్తూ తప్పించుకొనేందుకు ప్రయత్నిస్తున్నారు. తాగునీరు సరఫరా కాక గ్రామీణ ప్రజల నుంచి తీవ్రఒత్తిడి వస్తేనే పంచాయితీ కార్యదర్శులు స్పందిస్తున్నారే తప్ప లేకుంటే అసలు పట్టించుకోరు.

వేసవి నుంచి ఎలా గట్టెక్కాలని అధికారులు సమాలోచనలు మొదలుపెట్టారు. బావులు, బోర్లలో సమృద్ధిగా నీరు లభ్యమైతే ఎటువంటి సమస్య వుండదని, భూగర్భజలాలు అడుగంటితే ఏం చేయాలని ప్రశ్నించుకొంటున్నారు. మొత్తం మీద ముంచుకొస్తున్న తాగునీటి ఎద్దడి నివారణకు అధికారులు ఏం చర్యలు తీసుకొంటారు వేచి చూద్దాం.


## చందాదారులకు మనవి

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియ పరచండి.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా On- lineలో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయ వచ్చు. సకాలంలో చందా చెల్లించ వలసినదిగా కోరుతున్నాము.
- చెక్కులు స్వీకరించబడవు.

**జీవిత చందా రూ.1000/-**

**సంవత్సర చందా**

స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190

● ప్రజలకు

# ఉపయోగపడని ప్రభుత్వాస్పత్రి!

ఆత్మకూరులో పరిస్థితిది!

ఆత్మకూరు పట్టణంలోని ప్రభుత్వ ఆస్పత్రిలో పేదలకు వైద్యసేవలు అందడం లేదు. అక్కడకు వచ్చే రోగులకు వైద్యాన్ని అందించడంలో వైద్య సిబ్బంది నిర్లక్ష్యం అడుగడుగునా కన్పిస్తోంది. ఆస్పత్రి ప్రధాన వైద్యురాలు భాగ్యలక్ష్మి బుచ్చిరెడ్డిపాళెంలో నివసిస్తుంటుంది. ఆమె సాధారణ వైద్యం అందించడమే గగనమైంది, అలాంటిది అత్యవసర వైద్య సేవలకు ఆమె అందుబాటులో వుండదు. ఇతర సిబ్బంది పరిస్థితి అంతే. మందుల కొరత పట్టిపీడిస్తోంది. చివరకు గాయాలు తగిలితే కట్టే గుడ్డ దొరకని పరిస్థితి. ఆస్పత్రిలో ఎక్స్‌రే ప్లాంట్ వున్నా సిబ్బంది సక్రమంగా విధులకు రాకపోవడం, వచ్చినా నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తుండడంతో ఎక్స్‌రే తీసుకోవాలంటే రోగులు పడుతున్న అవస్థలు అన్ని ఇన్ని కావు. అంబులెన్స్ వున్నా అది కదలాలంటే ఇంధనం ఖర్చులు రోగులే భరించాల్సి వస్తుండడంతో ప్రమాదకరస్థితిలో వున్న పేదవారు ఆ ఖర్చులు భరించలేక ప్రాణాల మీదకు తెచ్చుకొంటున్నారు. వ్యాక్సిన్‌ల విషయంలో మాత్రం వైద్య సిబ్బంది కలసికట్టుగా వాటాలు వేసుకొని ప్రభుత్వం అందజేసే వాటిని సమానంగా పంచుకొని వాటిని ప్రైవేట్ మందులషాపులకు అమ్మేస్తుండడంతో అవి రోగులకు అందుబాటులో వుండడం లేదు. ఈ పరిస్థితుల్లో మంత్రి ఆనం ఆస్పత్రిని 100 పడకలకు పెంచుతానని చెప్పుండడంపై ప్రజలు పెదవి విరుస్తున్నారు. ముందు వైద్యసేవలు సక్రమంగా అందేలా చూస్తే చాలని పడకలు పెంచడం తర్వాత సంగతని వ్యాఖ్యానిస్తున్నారు.

# అక్రమాలకు పాల్పడితే చర్యలు!

## వెంకటగిరి ఎమ్పీడిఓ నిర్మలాదేవి

ఉపాధి పనుల్లో అక్రమాలు జరిగితే చర్యలు తప్పవని వెంకటగిరి ఎంపిడిఓ నిర్మలాదేవి హెచ్చరించారు. మండల పరిషత్ కార్యాలయంలో ఉపాధి పనులు చేసే మేస్త్రీలకు శిక్షణా కార్యక్రమం నిర్వహించారు. ఈ సందర్భంగా ఆమె మాట్లాడుతూ ఉపాధి నిధులతో పేదల భూముల్లో మొక్కల పెంపకాన్ని చేపడుతున్నట్లు తెలిపారు. అంచనాల్లో నిర్దేశించిన మేరకు కొలతల ప్రకారం పనులు చేయించాల్సిన బాధ్యత మేస్త్రీలపై వుందన్నారు. ప్రతిరోజూ వారు కూలీలకు సంబంధించిన పనుల కొలతలను నమోదు చేయాలన్నారు. వీటిని నమోదు చేయడంలో అప్రమత్తంగా వుండాలని, ఎలాంటి పొరపాట్లకు తావులేకుండా వ్యవహరించాలని సూచించారు. కూలీలకు అవసరమైన వసతి కల్పించాల్సిన బాధ్యత మేస్త్రీలదేనన్నారు. ఉపాధి పనుల్లో అవకతవకలు జరిగినట్లయితే మేస్త్రీలతోపాటు లబ్ధిదారులపైనా చర్యలు తప్ప వని హెచ్చరించారు. శిక్షణ ముగింపు సందర్భంగా పనుల సామాగ్రిని మేస్త్రీలకు పంపిణీ చేశారు. ఈ కార్యక్రమంలో సహాయ ప్రాజెక్టు అధికారి నరసింహారావు, పవన్, వెంకటయ్య తదితరులు పాల్గొన్నారు.

## రౌడీవార్డన్

● జీతమడిగితే వాచ్‌మెన్‌పై దౌర్జన్యం

చేజర్ల మండలం తూర్పు కంభంపాడు ప్రభుత్వ ఎస్సీ బాలుర వసతి గృహ వార్డెన్ నుంచి రక్షణ కల్పించాలంటూ అక్కడి వాచ్‌మెన్, అతని భార్య పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదు చేయడం కలకలం రేపింది. వాచ్‌మెన్‌గా చెంచురత్నం ఎంతో కాలంగా అక్కడ పని చేస్తున్నాడు. వార్డెన్‌గా పని చేస్తున్న బ్రహ్మయ్య అతనికి జీతం సక్రమంగా చెల్లించకపోవడమేగాక, కొత్త విధిస్తున్నాడట. ఇదేమి అన్యాయమని అడిగితే మద్యం మత్తులో వుండే వార్డెన్ వాచ్‌మెన్ దంపతులపై దౌర్జన్యానికి దిగుతున్నాడని పగలు, రాత్రి అనే తేడాలేకుండా డ్యూటీ చేయమని వేధిస్తున్నాడని వాచ్‌మెన్ దంపతులు పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదు చేశారు. ఎస్ఐ వార్డెన్‌ను పిలిచి మందలించినా తీరు మారకపోవడంతో చివరకు పొదలకూరు ఎఎస్‌డబ్ల్యుఓకు తమ గోడు వెళ్లబోసుకొన్నారు. వార్డెన్, ఎఎస్‌డబ్ల్యుఓ ప్రకాశం జిల్లాకు చెందినవారు కావడంతో వార్డెన్‌పై చర్యలు తీసుకొనేందుకు ఆయన నిరాకరిస్తున్నట్లు సమాచారం. ఈ అండ చూసుకొన్న వార్డెన్ నన్నెవరూ ఏమీ చేయలేరంటూ సవాల్ చేస్తుండడంతో వాచ్‌మెన్ దంపతులు ఏమీ చేయలేక కన్నీళ్ల పర్యంతం అవుతున్నారు.

## శిథిలావస్థకు వాకాడు బస్టాండ్

వాకాడు మండల కేంద్రంలో వున్న ఆర్‌టిసి బస్టాండు శిథిలావస్థకు చేరుకొనింది. భవన సముదాయాలు ప్రమాదకర స్థితికి చేరుకొన్నాయి. 1982లో ఆనాడు రెవెన్యూ మంత్రిగా వుండిన నేదురుమల్లి జనార్ధనరెడ్డి బస్టాండ్‌ను ప్రారంభించారు. తర్వాత కాలంలో చుట్టుప్రక్కల మండలాల ప్రయాణీకులను దృష్టిలో వుంచుకొని డిపోను ఏర్పాటు చేశారు. బస్టాండ్‌లో మాత్రం ప్రయాణీకులకు తగిన వసతులు కల్పించడంలో అధికారులు తగిన శ్రద్ధ వహించకపోవడంతో తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. భవన సముదాయాలు శిథిలమై కూలిపోయే స్థితిలో చేరుకున్నాయి. శ్లాబ్ పెచ్చులూడి మీద

### ఆర్టీసి అధికారుల్లో చలనం లేదు

పడుతుండడంతో ప్రయాణీకులు భయాందోళనలు చెందుతున్నారు. మరుగుదొడ్ల గత మూడేళ్లుగా మూతపడి వున్నా పట్టించుకొనేవారే లేకుండా పోయారు. త్రాగునీటి సౌకర్యం లేకపోడంతో వారు పడుతున్న అవస్థలు అన్ని ఇన్ని కావు. చివరకు కూర్చునేందుకు కుర్చీలు గాని, బల్లలు గాని లేవు. బస్టాండులో రోడ్డు పూర్తిగా ధ్వంసమైపోయివుంది. వర్షాకాలంలో అయితే బస్టాండ్ ప్రాంగణమంతా నీటితో నిండిపోతుంది. ఇప్పటికైనా ఆర్‌టిసి అధికారులు బస్టాండ్‌లోని సమస్యలను పరిష్కరించాలని ప్రయాణీకులు కోరుకొంటున్నారు.

## గ్రంథాలయంలో పుస్తకాల కొరత

రాష్ట్రంలోని ఏకైక ప్రభుత్వ మత్స్యకళాశాల ముత్తుకూరులో వుంది. పలు ప్రాంతాలకు చెందిన విద్యార్థులు ఇక్కడ చదువుకొంటున్నారు. కళాశాలకు తగినట్లు సదుపాయాలు మాత్రం కరువయ్యాయి. ముఖ్యంగా విద్యార్థులకు ఎంతో అవసరమైన గ్రంథాలయం వున్నా అది నామమాత్రమైంది. ప్రధా

### ముత్తుకూరు ఫిషరీ కాలేజీలో దుస్థితి

నమైన గ్రంథాలు విద్యార్థులకు అందుబాటులో లేకపోవడంతో వారు అసౌకర్యానికి గురికావాల్సి వస్తోంది. అసలే ప్రత్యేక ఏర్పాట్లులేక కళాశాలలోని చిన్న గదిలో వుండే ఈ గ్రంథాలయంలో పుస్తకాలు కరువవడంతో విజ్ఞానాన్ని అందించేందుకు ఏర్పాటైన లైబ్రరీ దేనికి ఉపయోగపడడం లేదని వారు వాపోతున్నారు.



ప్రపంచ పుస్తక పఠన దినోత్సవాన్ని పురస్కరించుకొని నెల్లూరులో వేదిక పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న డాక్టర్ పెళ్లకూరు జయప్రద, డాక్టర్ సుధాకర్, సి.నారాయణరావు, సతీష్, పద్మాకర్, ఈతకోట సుబ్బారావు.



శాసనమండలి సభ్యునిగా ఎన్నికైన డాక్టర్ బచ్చల పుల్లయ్యను నెల్లూరు గాండ్ల తెలికుల సంక్షేమ సంఘం తరపున సన్మానిస్తున్న సంఘం అధ్యక్షుడు మురళీకృష్ణా హోటల్ అధినేత గ్రోసు గోపాలయ్య. ప్రక్కన కలత్తూరు వెంకటరత్నం, తిరుపతి హరగోపాల్.




విఆర్ న్యాయకళాశాల ఫైనల్ ఇయర్ విద్యార్థులు ప్రాక్టికల్ ట్రెనింగ్‌లో భాగంగా మాదరాజు గూడూరులో ఏర్పాటు చేసిన ఉచిత న్యాయ సహాయ శిబిరంలో మాట్లాడుతున్న న్యాయవాది రామశేషయ్య, కళాశాల విద్యార్థి పెనుబల్లి పెంచలరెడ్డి.



నెల్లూరు తిక్కన రచయితల సంఘం ఆధ్వర్యంలో జరిగిన సిపి బ్రౌన్ స్మారక సాహిత్య సభలో కవి ఐటి.రాజుకు మొమెంటోను అందజేస్తున్న ప్రముఖ సినీ దర్శకులు కెవి.రమణ, అఖిల భారత కాంగ్రెస్ సేవాదళ్ జాయింట్ కన్వీనర్ భవాని నాగేంద్ర ప్రసాద్, కే.మురళీమోహన్‌రాజు.



పోలియో నిర్మూలనకు గాను నెల్లూరు రోటరీ క్లబ్‌కు తాము సేకరించిన విరాళం అందజేస్తున్న ముత్తుకూరు రోడ్డులోని గీతాంజలి పిజి కాలేజి విద్యార్థినులతో క్లబ్ అధ్యక్షుడు రాఘవేంద్రషెట్టి, కాలేజ్ డైరెక్టర్ జ్యోతిరెడ్డి.

# అభివృద్ధికి నోచుకోని అరుంధతీయవాడ

● కనీస సౌకర్యాలు లేవు

ముసునూరు గ్రామపంచాయితీ పరిధిలో గల పడమటి అరుంధతీయవాడ సమస్యల వలయంలో చిక్కుకొని వుంది. దళితుల సంక్షేమం కోసం పలు పథకాలను ప్రవేశపెడుతున్నామని ప్రభుత్వంలోని నేతలు పదే పదే ప్రకటనలు చేస్తున్నా వాస్తవ పరిస్థితి మాత్రం అందుకు విరుద్ధంగా వుందనేది ఈ ప్రాంత ప్రజలను పరిశీలించినట్లయితే తెలుస్తుంది. 240 కుటుంబాలు నివసించే ఇక్కడ ఏ పథకమూ వీరి దరిచేరిన ఆనవాళ్లు కన్పించడం లేదు. కనీస వసతులకు నోచుకోని దీనస్థితిలో అరుంధతీయవాడ ప్రజలు వుండడం బాధాకరం. ఈ ప్రాంతంలో కనీసం మంచినీటి సౌకర్యం లేకపోవడంతో దూర ప్రాంతాల నుంచి మంచినీటిని తెచ్చుకోవాల్సి వస్తోంది. పేరుకు కొళాయిలు వున్నా వాటిలో నీరు వచ్చిన దాఖలాలు లేవు. ఇక రోడ్ల సంగతి చెప్పనవసరం లేదు. మురికినీరు బయటకు పోయేందుకు తగిన ఏర్పాట్లు లేవు. 1400 మంది నివసిస్తున్న ఈ ప్రాంత బాగోగులు అటు అధికారులకు, ఇటు ప్రజాప్రతినిధులకు పట్టకపోవడంతో అభివృద్ధికి నోచుకోకుండా వుంది. పాతికేళ్ల క్రిందట నిర్మించిన గృహాలు శిథిలమైపోయాయి. ఈ పరిస్థితులలో అధికారులు శ్రద్ధ వహించి ఇళ్లను నిర్మించి ఇవ్వాలని, మౌలిక వసతులు కల్పించాలని కాలనీ వాసులు కోరుకొంటున్నారు.

## మానవత్వం లేని వైద్య సిబ్బంది

నిండు చూలాలన్న కనికరం కూడా లేకుండా రాక్షసంగా ప్రవర్తించి ఆస్పత్రి నుంచి గెంటేసిన నర్సుల ప్రవర్తన సూళ్లూరుపేట మండలంలో వివాదాస్పదమైంది. స్థానికంగా నివాసం వుండే సుజాత అనే మహిళ ప్రసవం కోసం ప్రభుత్వ వైద్యశాలకు వెళ్లింది. అక్కడ విధులు నిర్వహిస్తున్న నర్సులు మానవత్వం మరచి ఇక్కడ కాన్పు చేయమని చెప్పి బలవంతంగా ఆస్పత్రి నుంచి బయటకు పంపేశారు. ఆమె పరిస్థితి ప్రమాదకరంగా మారడంతో చలించిన స్థానికులు కొందరు 108కు సమాచారం

### బాలింతను గెంటేశారు

అందివ్వడంతో వాళ్లు వచ్చి తిరిగి ఆమెను ప్రభుత్వ ఆస్పత్రికి తీసుకవచ్చారు. వైద్యులు, సిబ్బంది నిర్లక్ష్యంగా వ్యవహరించడంతో ఆగ్రహించిన ప్రజలు వైద్యులను నిలదీయడంతో చివరకు ఆ మహిళకు పురుడు పోశారు. ఇంత జరుగుతున్నా వైద్యాధికారి మస్తానమ్మ మాత్రం ఈ విషయం తనకు తెలియదని ఎవరూ చెప్పలేదని చెప్పారు. మహిళలు మాత్రం ఆస్పత్రి సిబ్బంది ప్రవర్తనపై మండిపడుతున్నారు.

# ఆత్మకూరు డ్రైనేజి తీస్తారు!

ఎవరికీ పట్టదా?

ఆత్మకూరు పట్టణంలో డ్రైనేజీ అస్తవ్యస్తంగా వుండడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. ఎప్పుడో దశాబ్దాలు క్రిందట ఏర్పాటు చేసిన డ్రైనేజీ వ్యవస్థ ఇప్పటి జనాభాకు తగినట్లు లేకపోవడం, రోజురోజుకు పట్టణ పరిధి విస్తరిస్తుండడంతో డ్రైనేజీ అస్తవ్యస్తంగా మారింది. పేరుకు పంచాయితీ అయినా నియోజకవర్గ కేంద్రం, మండల కేంద్రం కావడం, పలు ప్రభుత్వ కార్యాలయాలు, కోర్టులు, మూడు డిగ్రీ కళాశాలలు, పలు జూనియర్ కాలేజీలు, పాఠశాలలు వుండడంతోపాటు జనాభా పెరిగింది. పెరిగిన జనాభాకు తగినట్లు సౌకర్యాలు మెరుగుపడకపోవడంతో ప్రజలు అవస్థలు పడాల్సి వస్తోంది. రోడ్డుకు ఇరువైపులా నిర్మించిన సైడు కాలువల్లో మురుగునీరు సక్రమంగా ప్రవహించకపోవడం, ఎక్కడ చూసినా చెత్త చెదారాలు పేరుకపోయి వుండడంతో దుర్గంధ భరితంగా మారాయి వీధులు. పందులు స్వైరవిహారం చేస్తుండడంతో జనావాసాలు డంపింగ్ యార్డును తలపిస్తున్నాయి. ఎంతోకాలంగా ఈ సమస్య ఎదురౌతున్నా పంచాయితీ పాలకులు, అధికారులు పట్టించుకోకపోవడంతో అస్తవ్యస్తంగా మారిన పారిశుద్ధ్యం నడుమ ప్రజలు నివసించాల్సి వస్తోంది.

# కోవూరుపల్లి చెరువు ఆక్రమణ!

బోగోలు మండలంలోని కోవూరుపల్లి చెరువు ఆక్రమణలతో కుచించుకపోతోంది. చెరువు క్రింద సాగు చేస్తున్న కొందరు హద్దులు మార్చి చెరువును కబళించి వేస్తుండడంతో రోజురోజుకు చెరువు ఆక్రమణ చెరచిక్కి రూపు కోల్పోతుంది. 140 ఎకరాల విస్తీర్ణంలో గల ఈ చెరువు క్రింద 10 గ్రామాల రైతులు సాగు చేసుకొంటున్నారు. ఆక్రమణకు గురి అవుతుండడం తోపాటు సాగుకు నీరు అందని పరిస్థితి ఏర్పడుతోంది. తుఫాన్‌ల తాకిడికి చెరువు కట్ట దెబ్బతింది. నీటి నిల్వ తగ్గిపోయి రైతులకు సాగునీరు అందని పరిస్థితి. చెరువు మరమ్మత్తులకు 20 లక్షల రూపాయలు మంజూరై రెండేళ్లు గడుస్తున్నా ఇంతవరకు పనులు ప్రారంభం కాకపోవడంతో అటు సాగు నీరు, ఇటు త్రాగునీటికి పలు గ్రామాల ప్రజలు అల్లాడిపోతున్నారు. ఈ విషయమై నీటిసంఘం అధ్యక్షుడు శివరామకృష్ణ మాట్లాడుతూ ఇప్పటికే చెరువులో చాలా భాగం కబ్జాకు గురైనా అధికారులు పట్టించుకోవడం లేదని విమర్శించారు. రాజకీయ నేతల అండదండలతో కొందరు యదేచ్ఛగా ఆక్రమణలకు పాల్పడుతున్నా స్పందించకపోవడం పట్ల వారి పాత్రపైన అనుమానాలు వ్యక్తమవుతున్నాయన్నారు. తక్షణం ఆక్రమణదారులపై చర్యలు తీసుకోవాలని, చెరువు మరమ్మత్తు పనులు వెంటనే జరిపించాలని ఆయన డిమాండ్ చేశారు.

### పట్టించుకోరా?

● పోలీసుల మధ్య

# సరిహద్దు వివాదం!

దొంగలు బారినపడి నగలు, నగదు కోల్పోయిన బాధితురాలి నుంచి ఫిర్యాదు తీసుకొనేందుకు నిరాకరించిన పోలీసులు అది తమ స్టేషన్ పరిధి కాదంటూ నలుదిక్కులు తిప్పిన వైనం ఉదయగిరి నియోజకవర్గంలో చోటు చేసుకొంది. దుత్తలూరుకు చెందిన లక్ష్మమ్మ అనే ఆమె బెంగుళూరు నుంచి తిరిగి గ్రామానికి వస్తుండగా ఆమె బ్యాగును దొంగలు తస్కరించారు. తేరుకొన్న ఆమె మర్రిపాడు పోలీస్ స్టేషన్‌కుపోగా, ఇది తమ పరిధిలోనిది కాదంటూ అక్కడి పోలీసులు ఆత్మకూరుకు పొమ్మనారు. అక్కడకు వెళ్తే వారు కొంతసేపు తర్జనభర్జనపడి ఉదయగిరి స్టేషన్‌కు పొమ్మనారట. అక్కడి సిబ్బంది మర్రిపాడుకు పొమ్మని సలహా ఇవ్వడంతో బాధితురాలు కన్నీళ్ల పర్యంతమయ్యింది. బ్యాగులో 20సవర్ల బంగారు నగలు, 20వేల నగదు వున్నాయని, కానీ ఏ పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు స్వీకరించకుండా ఇబ్బంది పెడుతున్నారని వాపోయింది. మొత్తం మీద ఇటీవల పోలీసుశాఖకు ఈ క్రొత్త రోగం పట్టుకోవడం ప్రజలకు చికాకులు సృష్టిస్తోంది.

### బాధితుల లబోదిబో

# హామీలిస్తాడు...పనిచేయడు!

### ఎమ్పీ చింతా తీరుపై చింత!

నేతల మాటలు నీటి మూటలన్న విషయాన్ని అక్షరాలా నిరూపిస్తున్నాడు తిరుపతి ఎంపి చింతా మోహన్. కలువాయి మండలానికి పలుమార్లు వచ్చిన ఆయన అక్కడ జరిగే మండల సమావేశాలకు హాజరవుతుంటారు. ఆయన పర్యటన స్థానిక కాంగ్రెస్ నాయకులకు గానీ, అధికారులకుగానీ తెలియనివ్వడు. మండలానికి వచ్చిరాగానే చింతా ముందుగా ప్రభుత్వ ఆస్పత్రిని తనిఖీ చేస్తాడు. అక్కడ వైద్యులు రోగులకు అందిస్తున్న వైద్య సేవలను, మౌలిక సదుపాయాలను, సమస్యలను అడిగి తెలుసుకోవడం రివాజు. తర్వాత సమస్యలను పరిష్కరిస్తానని తనదైన శైలిలో హామీలు గుప్పిస్తాడు. అనంతరం మండల సమావేశానికి హాజరై ప్రతి సర్పంచ్ నుంచి ఆయా గ్రామాల సమస్యలు తెలుసుకొంటాడు. చివరిగా ప్రతి గ్రామంలో వీధిలైట్లను ఏర్పాటు చేసేందుకు ఎంపి గ్రాంటు నుంచి లక్షరూపాయలు ప్రతి గ్రామానికి ఇస్తున్నట్లు ప్రకటించి వెళ్లిపోతాడు. ఇలా ప్రతి మూడు నెలలకు హామీలు ఇవ్వడం తప్ప ఒక్క సమస్యను పరిష్కరించిన దాఖలాలు లేవు. చింతామోహన్ మండలానికి వచ్చినపుడల్లా పాతపాటే పాడుతుండడంపై స్థానిక నాయకులు వ్యంగ్యంగా మాట్లాడుతున్నారు. లక్ష రూపాయల ఎంపి, వీధిలైట్ల ఎంపిగారు వస్తున్నారంటూ గుసగుసలాడుకోవడం చర్చనీయాంశమయ్యింది.

# అధ్వాన్నంగా వెంకటగిరి రోడ్లు!

వెంకటగిరి పట్టణం క్రమక్రమంగా పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్నా అర్‌అండ్‌బి రోడ్లు మాత్రం అధ్వాన్నంగా వున్నాయి. పట్టణం నుంచి గ్రామాలకు వెళ్లే రోడ్లు మరీ దారుణంగా దెబ్బతిని వున్నాయి. పరిసర ప్రాంతాలలో వివిధ పరిశ్రమలు ఏర్పాటవుతుండడం, రియల్‌ఎస్టేట్ వ్యాపారం ఊపందుకోవడంతో ఈ రోడ్లపై తిరిగే వాహనాల సంఖ్య అధికం కావడం, భారీ వాహనాలు ప్రయాణిస్తుండడంతో రోడ్లు గుంటలుపడి ప్రయాణించాలంటేనే నరకం కన్పించేలా తయారయ్యాయి. మన్నవరంలో భెల్ పరిశ్రమ ఏర్పాటయిన కారణంగా ఈ రహదారిని విస్తరించాల్సిన అవసరం ఏర్పడింది. డక్కిలి మండలంలోని ప్రముఖ పుణ్యక్షేత్రమైన దేవుడు వెలంపల్లి గ్రామానికి వెళ్లే రహదారి ధ్వంసమైపోయింది. అధిక సంఖ్యలో భక్తులు వెళ్లే పుణ్యక్షేత్రం రోడ్డు బాగోగులు అధికారులు పట్టించుకోవడం లేదు. రాపూరు – పెంచలకోన రోడ్డుది ఇదే పరిస్థితి. నృసింహస్వామి తిరునాళ్ల సందర్భంగా జిల్లా నలుమూలల నుంచి భక్తులు అక్కడకు విచ్చేస్తారు. ప్రజల అవసరాలను దృష్టిలో వుంచుకొని దెబ్బతిన్న రహదారులను మరమ్మత్తులు జరిపించాల్సిన బాధ్యత అధికారులపై వుంది.

### ఎలా పయనించాలి?

## అక్షయ తృతీయ నాడు బంగారం కొంటే

# లక్ష్మీదేవి మన ఇంట కొలువవుతుంది!

ప్రతి పండుగకు ఒక్కో విశిష్టత, గొప్పదనం వుంది. పురాణాలు, శాస్త్రాలు, భగవత్సంబంధమైన కథనాలు ఈ



పండుగలతో ముడిపడి వున్నాయి. అలాంటి పండుగల్లో ఎన్నో విశిష్టతలకు నెలవైనది అక్షయతృతీయ. ఈ పండుగకు సంబంధించి ఎన్నో కథనాలు ప్రచారంలో వున్నాయి. హిందువులతోపాటు, జైనులు ఎంతో భక్తిశ్రద్ధలతో, ఆనందోత్సాహాలతో జరుపుకొనే పండుగగా దీనికి ప్రాచుర్యం వుంది. వైశాఖ శుద్ధ తృతీయనాడు కృతయుగం, కార్తీక శుక్ల నవమినాడు త్రేతాయుగం, భాద్రపద బహుళ త్రయోదశినాడు ద్వాపరయుగం, చైత్రశుద్ధ పాడ్యమినాడు బ్రహ్మసృష్టి రచనకు పూనుకొన్నట్లు చెప్పబడుతోంది. కృతయుగ ఆరంభమైనట్లు చెప్పే వైశాఖ శుద్ధ తృతీయని అక్షయ తృతీయగా జరుపుకొంటారు. శ్రీమన్నారాయణుడు దుష్టశిక్షణ, శిష్టరక్షణ కోసం ఎత్తిన దశావతారాల్లో ఆరవ అవతారమైన పరశురాముడు జన్మించింది ఆనాడే.

అక్షయ అంటే క్షయం కానిది అని అర్థం. శుభప్రదమైన ఆరోజున ఏ కార్యక్రమం చేపట్టినా దిగ్విజయం అవుతుందని నమ్మకం. ఈ పండుగనాడు సిరి సంపదలను అందించే లక్ష్మీదేవిని పూజిస్తారు. జైనులు భక్తిశ్రద్ధలతో జరుపుకొనే అక్షయ తృతీయకు సంబంధించి ఒక పురాణ కథనం వుంది. జైన మతంలో మొదటి తీర్థంకరుడిగా రిషబదేవుడిని పూజిస్తారు. ఆయన్నే అధినాథ్ అని కూడా అంటారు. అయోధ్యకు రాజైన ఆయన సన్యాసం స్వీకరించి తీర్థంకరుడిగా మారాడు. సాధారణంగా తీర్థంకరులు నిరాడంబరంగా జీవిస్తారు. వారు ఎలాంటి ఆహారాన్ని తయారు చేసుకొని తినరు. ఎవరైనా పెడితే స్వీకరిస్తారు. రిషభదేవుడు ఆహారం కోసం ఆ రాజ్యంలోని ప్రజలందరిని అడిగినా వారు వజ్రాలు, ఆభరణాలు ఇస్తామంటారే తప్ప ఆహారం ఇవ్వరు. చాలాకాలం ఉపవాసంలో వున్న ఆయనకు మనుమడైన శ్రియాన్సకుమార్ వచ్చి చెరకు రసం అందివ్వడంతో ఉపవాస దీక్షను ముగిస్తాడు. తీర్థంకరుడు దీక్షమానిన ఆరోజును అక్షయ తృతీయగా చెప్తారు. హిందువులు విష్ణుమూర్తిని పూజిస్తారు.

అక్షయ తృతీయనాడు బంగారం కొన్నట్లయితే లక్ష్మీదేవి కొలువై వుంటుందని నమ్మకం. తృతీయనాడు బంగారం కొనడం ఎంత ముఖ్యమో దానధర్మాలు చేయడం అంతే ముఖ్యం. ఆ రోజున వస్త్రాలు, ఆహారం, ధాన్యం ఇలాంటి వాటిని దానం చేసినట్లయితే ఎంతో పుణ్యఫలాలు అందుతాయని చెప్తారు. ఈ పండుగ సందర్భంగా నెల్లూరులోని పలువురు బంగారు వ్యాపారులు వివిధ స్కీంలను ప్రవేశపెడుతున్నారు. అవి వారి మాటల్లోనే విందాం.

### బహుమతిగా స్కూటీ

అక్షయ తృతీయ సందర్భంగా మా షోరూంలో బంగారు కొన్న వారికి బహుమతులను అందిస్తున్నాం. ప్రతి 10వేల కొనుగోలుపై లక్కీడిప్ తీసి ఇద్దరి విజేతలకు టివిఎస్ స్కూటీ, మరో ఇద్దరికి డైమండ్ రింగ్‌లు అందిస్తున్నాం. వారం వారం ఈ బహుమతులుంటాయి.

***మణిలాల్‌జైన్,*** *జైన్‌గోల్డ్*

### కోరుకొన్న ధరకే...

అక్షయ తృతీయను పురస్కరించుకొని ఏప్రెల్ 25తేదీ నుండి మే 6తేదీ లోగా కొనుగోలు రోజు నుంచి పండుగ రోజు లోపల ఏ రోజు తక్కువ ధర వుంటుందో ఆ ధర లెక్కించి మిగిలిన మొత్తం తిరిగి ఇస్తాం. బంగారు నగలపై గ్రాముకు 50రూ, డైమండ్స్‌పై 8.5% తగ్గింపునిస్తాం.

***శాంతిలాల్‌జైన్,***
*శాంతిలాల్ అండ్ సన్స్ జ్యూయలర్స్*

### అక్షయ వృక్షం

ఖాతాదారులను దృష్టిలో వుంచుకొని అక్షయ వృక్షం స్కీంను ప్రవేశపెట్టాం. ప్రతి నెలా వారు కట్టే మొత్తానికి అంతే విలువగల బంగారాన్ని వారి ఖాతాలో జమ చేస్తాం. 12 నెలల తర్వాత ఎంత జమవుతుందో ఆ మొత్తానికి నగలను అందివ్వడమేకాక సభ్యులకు కానుకగా లక్ష్మీదేవి కాయిన్ ఉచితంగా అందిస్తున్నాం.

***లలిత్‌జైన్,*** *న్యూ ఆంధ్రా జ్యూయలరీ*

### రూ.400/-లు తగ్గింపు

అక్షయ తృతీయను పురస్కరించుకొని బంగారంపై సవరకు 400 రూపాయలు, డైమండ్స్‌పై 10% తగ్గింపునిస్తున్నాం. ఖాతాదారులు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని కోరుతున్నాం.

***భరత్‌జైన్,*** *గోల్డ్ ప్యాలెస్*

## ఉప ఎన్నికల ఖర్చెంత?



కడప ఉప ఎన్నికల్లో ఆయా అభ్యర్థులు పెడుతున్న ఖర్చెంత? అన్న విషయమై రాజకీయ వర్గాల్లో వాడివేడి చర్చ జరుగుతోంది. పులివెందుల శాసనసభ, కడప లోక్‌సభ నియోజక వర్గాల్లో పోటీ చేస్తున్న ప్రధాన పార్టీల అభ్యర్థులు కలిపి మూడొందల కోట్లరూపాయలకుపైగానే ఖర్చుచేస్తున్నట్లు ఒక అంచనా. కొత్తగా ఏర్పాటైన వైఎస్‌ఆర్ కాంగ్రెస్‌పార్టీ తరపున ఒక్క జగనే సుమారు రెండొందలకోట్ల రూపాయల దాకా ఖర్చు పెడ్తున్నాడని కాంగ్రెస్ వర్గాలంటున్నాయి. కాగా కాస్త అటో ఇటో కాంగ్రెస్ కూడా ధారాళంగానే ఖర్చు పెడుతోందని తెలుగుదేశం ఆరోపిస్తోంది. కాగా ఖర్చు విషయంలో తెలుగుదేశం మాత్రం మూడవస్థానంలో వుందన్న విషయాన్ని జగన్, కాంగ్రెస్ వర్గాలు అంగీకరిస్తున్నాయి. జగన్ ఎన్నికల గుర్తు సీలింగ్ ఫ్యాన్‌లకు మార్కెట్లో తెగ డిమాండ్ ఏర్పడింది. రాత్రికి రాత్రే సీలింగ్ ఫ్యాన్‌లకు రెక్కలొచ్చి కడపకు ఎగిరిపోతున్నాయి. ఒక ఫ్యాన్ల తయారీ కంపెనీకి ఏకమొత్తంగా రెండులక్షల ఫ్యాన్ల ఆర్డర్ లభించింది. దీని వెనుక జగన్ హస్తం వుందంటూ కాంగ్రెస్ ఆరోపిస్తోంది. కాగా ఉప ఎన్నికలు పోలింగ్ నాటికి కడప, లోక్‌సభ నియోజక వర్గంలో కొత్త సీలింగ్ ఫ్యాన్లు లక్షల సంఖ్యలోనే కనిపించబోతున్నాయి. కాగా ఏటియం ద్వారా డబ్బులు పంపిణీ చేసే కార్యక్రమం ముమ్మరంగా వుంది. దీనిపై ఇప్పటికే ఎన్నికల సంఘానికి ఫిర్యాదులు అందాయి.

## సత్యసాయి ట్రస్టీగా గీతారెడ్డి



సత్యసాయిబాబా ట్రస్ట్‌లో సభ్యత్వం కోసం రాష్ట్రమంత్రి గీతారెడ్డి సీరియస్‌గానే ప్రయత్నిస్తున్నారట. లక్షాఅరవైవేల కోట్ల రూపాయల ట్రస్ట్‌లో ప్రస్తుతం రాజకీయులెవరూ సభ్యులుగా లేరు. మొదటి నుంచి కూడా ట్రస్ట్‌లో రాజకీయులు లేకుండా 'బాబా' జాగ్రత్తపడ్డారు. అయితే మారిన పరిస్థితుల దృష్ట్యా బాబా నియమించిన ట్రస్ట్ బోర్డును పునర్వ్యవస్థీకరించే అవకాశం వుంది. కేవలం ప్రయివేటు వ్యక్తులు, బాబా భక్తులతోపాటు రాష్ట్రప్రభుత్వం తరపున కూడా ఒక ప్రతినిధిని నియమించాలన్న ప్రతిపాదన తెరపైకి వచ్చింది. బాబాకు వీరభక్తురాలిగా వున్న గీతారెడ్డి గత నెలరోజులుగా పుట్టపర్తి లోనే వుంటూ ప్రభుత్వ ప్రతినిధిగా వ్యవహారాల్ని చక్కబెడుతున్నారు. ఈ నేపథ్యంలో ప్రభుత్వ ప్రతి నిధిని నియమించే పక్షంలో తనకే అవకాశం కల్పించాలని గీతారెడ్డి కోరుతున్నారట. చూద్దాం... బాబా సంకల్పం ఎలా వుంటుందో!!

## ఉప ఎన్నికలపై సోనియా ఆరా!



కడప ఉప ఎన్నికల గురించి కాంగ్రెస్ అధినేత్రి సోనియాగాంధీ ఆరా తీశారు. మంగళవారం నాడు పుట్టపర్తికి వచ్చిన సందర్భంగా సోనియా ఉప ఎన్నికల తీరుపై ముఖ్యమంత్రి కిరణ్‌తో కొద్దిసేపు చర్చించారట. కడప ఎన్నికల్లో కాంగ్రెస్ అనుసరిస్తున్న వ్యూహం, ప్రచార సరళి గురించి కిరణ్ వివరించాడట. కాంగ్రెస్‌లో వుంటూ జగన్‌కు మద్దతుపలుకుతున్న ఎమ్మెల్యేల వల్ల చిక్కులు ఎదురవుతున్నట్లు కిరణ్ ఫిర్యాదుచేసినట్లు పార్టీ వర్గాలు చెబుతున్నాయి. కడప ఎన్నికల గురించి తనతో టచ్‌లో వుండాలని సోనియా చెప్పారట. సోనియా పర్యటన రాజకీయం కానప్పటికీ కడప ఎన్నికల గురించి వాకబు చేయడాన్ని చూస్తే ఆమెకు ఎంత ఆందోళన వుందో అర్థం చేసుకోవచ్చుంటూ గాంధీభవన్ వర్గాలు చెవులు కొరుక్కుంటున్నాయి.

## ఆస్తులు ప్రకటించని ఐఎఎస్‌లపై చర్చ!



ఆస్తులు ప్రకటించాల్సిన తుదిగడువు ముగిసినా ఇంకా స్పందించని ఐఎఎస్ మొండిఘటాలపై మొట్టికాయ వేయడానికి ప్రభుత్వం రంగం సిద్ధం చేస్తోంది. రాష్ట్రంలో చాలామంది ఐఎఎస్‌లు వందలకోట్ల రూపాయల విలువ చేసే ఆస్తుల్ని కూడ బెట్టినట్లు ఆరోపణలున్నాయి. వీరిపై అవినీతి నిరోధకశాఖ వద్ద ఆధారాలు కూడా వున్నాయి. అయితే ప్రభుత్వ అనుమతి లభించకపోవడంతో ఎసిబి చేతులు ముడుచుకొని వుండిపోయింది. ప్రస్తుతం ఆస్తుల వివరాలు ప్రకటించకుండా చోద్యం చూస్తున్న ఐఎఎస్‌ల జాబితాను ఎసిబికి పంపించాలని ప్రభుత్వం యోచించింది. శ్రీలక్ష్మీ, ఎ.ఆర్.సుకుమార్, దాసరి శ్రీనివాసులు, గార్గ్, ద్వివేది. వంటి ఐఎఎస్‌లు ఇప్పటిదాకా ఆస్తుల వివరాలు వెల్లడించలేదు. ఇటువంటి వారి జాబితా వందకు పైగానే వుండడంతో ప్రభుత్వం సీరియస్‌గా వుంది. ఆస్తుల్ని ప్రకటించే వరకు ప్రమోషన్లు, డిప్యూటేషన్లకు అడ్డుకట్ట వేయాలన్ని ప్రతిపాదన ఫైలు ఇప్పటికే రూపొందింది. మొత్తానికి ఐఎఎస్‌లకు గడ్డుకాలమే అంటున్నాయి సచివాలయ వర్గాలు. చూద్దాం... ఏం జరుగుతుందో!!

# ట్రం కు రో డ్డు



## బాబా... సాయిబాబా



పుట్టపర్తి సత్యసాయి బాబా ఆరోగ్య పరిస్థితిపై ఆయన భక్తుల్లో ఆందోళన నెలకొంది. వైద్యులు పొంతనలేని ప్రకటనలు చేస్తుండడంతో ఎప్పుడు ఏ వార్త వినాల్సి వస్తుందోనని మనోక్లేశానికి గురవుతున్నారు. విఆర్‌సి వద్ద గల సాయిసదన్, రామ్మూర్తినగర్‌లో గల సాయి మందిరంలో బాబా త్వరగా కోలు కోవాలని తిరిగి దర్శనమివ్వాలని భక్తులు పూజలు చేస్తున్నారు. నగరంలో ఎక్కడ విన్నా, ఎవరిని పలకరించినా బాబా ఆరోగ్యం, ట్రస్టు కార్యకలాపాలపై వాడి వేడి చర్చ జరుగుతుంది. ట్రస్ట్ సభ్యుల ప్రవర్తన, ఆస్తులు, ఆశ్రమంలో కానుకలపై ట్రంకురోడ్డులో హాట్ హాట్ చర్చలు జరుగుతున్నాయి.

## తప్పును దిద్దుకొన్నారు




కొన్నిసార్లు అధికారులు తీసుకొన్న నిర్ణయాలు వివాదాస్పదమవుతుంటాయి. వీటిని సరిదిద్దుకొంటే ఎవరికైనా మనుగడ వుంటుంది. నెల్లూరు కొండాయపాళెం గేటు సమీపంలోని సాంఘిక సంక్షేమ శాఖ వసతి గృహ సముదాయంలో కొంత భాగాన్ని రెవిన్యూ అధికారుల సంఘం రిక్రియేషన్‌కు పాత కలెక్టర్ కేటాయించడంపై నగరంలో దళిత సంఘాలు పెద్ద ఎత్తున ఉద్యమించాయి. దీంతో ఇన్‌ఛార్జ్ కలెక్టర్‌గా వుండిన సౌరభ్‌గౌర్ సమస్యను తెగే వరకు లాగకుండా పాత కలెక్టర్ ఇచ్చిన ఉత్తర్వును రద్దుచేసి శాఖ పరువు నిలబెట్టడాన్ని అందరూ ప్రశంసించారు.

## శిలువ మోతలోనూ పోటీ



నెల్లూరులో రాజకీయ నాయకులు ఏ కార్యక్రమంలో పాల్గొన్నా ప్రజలను ఆకట్టుకొనేందుకు అధిక ప్రాధాన్యమిస్తుంటారు. అది సభ అయినా, ప్రైవేట్ కార్యక్రమమైనా, చివరకు ఆధ్యాత్మిక కార్యక్రమమైనా చిత్రవిచిత్ర ధోరణులకు వెరవరు. మామూలుగా గుడ్‌ఫ్రైడేను పురస్కరించుకొని నెల్లూరులోని ఫత్తేఖాన్‌పేట చర్చిలో ఎమ్మెల్యే వివేకానందరెడ్డి ప్రతియేడు శిలువ మోస్తారు. వివేకాతో కలసి తిరిగే నెల్లూరు సిటీ ఎమ్మెల్యే శ్రీధరకృష్ణారెడ్డికి శిలువ మోయాలన్న కోరిక కలిగినట్లుంది. కపాడిపాళెం అంతా శిలువమోస్తూ తిరిగి రోమన్ క్యాథలిక్ చర్చి వద్దకు చేరి బిషప్ ఎమ్డీ ప్రకాశం ఆశీర్వచనం తీసుకొన్నారాయన.

## ఎంత మాట... ఎంత మాట!



బదలీపై వెళ్లిన కలెక్టర్ రాంగోపాల్ సన్మాన కార్యక్రమాన్ని, కొత్త కలెక్టర్ శ్రీధర్ స్వాగత కార్యక్రమాన్ని 22వ తేది నగరంలో రెవిన్యూ ఉద్యోగుల సంఘం ఘనంగా నిర్వహించింది. ఈ సందర్భంగా పాత కలెక్టర్ రాంగోపాల్ పలికిన పలుకులు పలువురిని ఆశ్చర్య పరిచాయి. జిల్లాపై చెరగని ముద్రవేసిన ఎస్‌ఆర్ శంకరన్ తనకు ఆదర్శమని, నెల్లూరులో ఆయన్ను ఆదర్శంగా తీసుకొని పనిచేశానని చెప్పేసరికి అధికారులంతా విస్తుపోయారు. ఎంత మాట.. ఎంత మాట అంటూ సభలోనే వ్యాఖ్యానిస్తూ రాంగోపాల్ భూసేకరణల వరకే పరిమితమయ్యారని గుసగుసలాడుకోవడం కన్పించింది.




తలకు గాయాలు తగిలే అవకాశం. ఆరోగ్య విషయంలో ఒత్తిడి వల్ల, పైత్య ప్రకోపం వల్ల ఇబ్బందులు. కళత్ర సుఖం చక్కగా ఉంటుంది. విందు వినోదాలలో పాల్గొంటారు. ధన విషయంలో లోటుండదు. అయినా ఖర్చులు అనూహ్యంగా పెరుగుతాయి. స్పెక్యులేషన్ కూడా లాభిస్తుంది. భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు. రాజకీయులకు అత్యంతం అనుకూలమైన కాలం. విద్యార్థులకు మంచికాలం.




తల్లి అనారోగ్యం చింతనిస్తుంది. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. ఆదాయమార్గాలు విస్తరిస్తాయి. వ్యాపారులకు కొంతవరకు మేలు. పోటీలెక్కువ. భాగస్వాములతో జాగ్రత్త. రాజకీయులకు, వృత్తిపరులకు ప్రోత్సాహమెక్కువ. విద్యార్థులకు చదువు సాగదు. కళాకారులకు ఆశాభంగం. ఉద్యోగులకు శ్రమ తగ్గుముఖం పడుతుంది. గృహిణులకు పిల్లల అనారోగ్యం తీవ్ర ఆవేదనను కల్గిస్తుంది.




జ్వరం, నిద్రలేమి, గొంతులో అనారోగ్య బాధలుంటాయి. పాదాలకు గాయాలు తగిలే అవకాశం. కళత్రంతో గొడవలుండవచ్చు. ధన విషయాలలో లోటు లేదు. రుణరూపంలో కూడ ధనప్రాప్తి. ఆకస్మిక ఖర్చులు ఆవేదనను కల్గిస్తాయి. భాగస్వాములు మోసగించే అవకాశాలున్నాయి. వ్యాపారులకు పోటీలధికం. ఆదాయం తక్కువ. రాజకీయులకు ఉత్తమకాలం. వృత్తిపరులకు బాగా లేదు. విద్యార్థులకు శ్రమ.




ఆరోగ్య విషయం కొంత మెరుగు. పెద్దలతో గొడవలు రావచ్చు. తల్లి అనారోగ్యం ఆందోళనకరం. ఆర్థిక లావాదేవీలు మీకనుకూలంగా వున్నా స్పెక్యులేషన్ జోలికి పోవద్దు. భాగస్వాములు మోసగించే అవకాశాలున్నాయి. ఉద్యోగులకు ప్రోత్సాహకాలు లభిస్తాయి. భూ భవన, వస్తు, వాహనాల ద్వారా ఆదాయమార్గాలు సులభతరమౌతాయి. రాజకీయులకు, వృత్తిపరులకు ప్రోత్సాహం ఎక్కువ.




బిపి బాధలుండవచ్చు. మానసిక వేదనలు ఎదురవవచ్చు. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. సంతానకారణంగా బాధ. భగవత్సేవలో పాల్గొంటారు. నూతనమిత్రులు ఏర్పడతారు. ప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. గృహోపకరణాల కొనుగోలు చురుకుగా సాగుతాయి. వ్యాపార వృద్ధి చక్కగా సాగుతుంది. కొత్త భాగస్వామి లేదా మంచి అనుచరులు లభిస్తారు. రాజకీయులకు మేలైన కాలం.




కంటికి, ఊపిరితిత్తులకు సంబంధించి ఇబ్బందులు కొద్దిగా ఉండవచ్చు. పెద్దల సాయంతో ఉద్యోగవృద్ధి, వేతనవృద్ధి ఉంటుంది. స్థిర ధనాగమం ఆనందాన్నిస్తుంది. బంధువులకు మీ చేతనైన సహాయం చేస్తారు. వ్యాపారులు కొత్తసంబంధాలు ఏర్పరచుకొంటారు. రాజకీయులకు ప్రోత్సాహకరమైన కాలం. వృత్తిపరులకు కళాకారులకు మంచి ఆదరణ, ఆదాయం లభిస్తుంది.

# వారఫలాలు

*తేది 30-4-2011 నుండి 6-5-2011 వరకు మేషంలో రవి; మీనంలో కుజ, శుక్రులు; మేషంలో బుధ, గురువులు; ధనుస్సులో రాహువు; కన్యలో శని; మిథునంలో కేతువు; మీన, మేష, వృషభాల్లో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

30 తేదీ శని త్రయోదశి.
1 తేది మేడే. 4 తేది డొల్లు కర్తరి ప్రారంభం.
6 తేది అక్షయ తృతీయ, పరశురామ జయంతి, సింహాచలం చందనోత్సవం.

### శుభ ముహూర్తాలు

5,6 తేదీల్లో వృషభ లగ్నాన ఉ.6.30 నుండి 8.00గంటల వరకు, కర్కాటక లగ్నాన ఉ.10.00 నుండి 12.00 గంటల వరకు, సింహ లగ్నాన ప.1.30 నుండి 3.00 గంటల వరకు, వృశ్చిక లగ్నాన రా.7.00 నుండి 8.00 గంటల వరకు. కుంభ లగ్నాన రా.2.00 నుండి 3.00 గంటల వరకు శుభ ముహూర్తాలున్నాయి.

### ఏప్రెల్ తిథులు

**చైత్ర బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 30 | శని | త్రయోదశి | పూర్తిగా | |

### మే తిథులు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | ఆది | త్రయోదశి | ఉ.7.45 | గం.ల.వ |
| 2 | సోమ | చతుర్దశి | ఉ.9.40 | గం.ల.వ |
| 3 | మంగళ | అమావాస్య | ఉ.11.26 | గం.ల.వ |

**వైశాఖ శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 4 | బుధ | పాడ్యమి | ప.12.51 | గం.ల.వ |
| 5 | గురు | విదియ | ప.1.48 | గం.ల.వ |
| 6 | శుక్ర | తదియ | ప.2.20 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com




అనవసరపు విషయాలలో జోక్యం చేసుకోకుండడం మంచిది. నరాల బలహీనత, ఒత్తిడి బాధలుంటాయి. కుటుంబసభ్యుల తోడ్పాటు చక్కగా ఉంటుంది. ఆర్థికవిషయాలు బాగా తృప్తికరంగా వుంటాయి. ఉద్యోగులకు పై అధికారుల సాయం చక్కగా లభిస్తుంది. వ్యాపారులు భాగస్వాములతో సఖ్యంగా ఉండడానికి ప్రయత్నించండి. రాజకీయులు తోటివారి విషయంలో జాగ్రత్తగా ఉండాలి.




గృహనిర్మాణం లేదా వసతి గృహాన్ని అమ్మడం అనే పనులలో నిమగ్నమవుతారు. బిపి బాధితులు జాగ్రత్తగా ఉండాలి. జీవిత భాగస్వాముల నుండి సహాయ సహకారాలందుతాయి. ఊహించనిరీతిలో ధనవ్యయమవుతుంది. అయినా పొదుపు చేస్తారు. ఇష్టులైనవారికి ఖర్చవవచ్చు. వ్యాపారులకు, వృత్తిపరులకు మేలైన కాలం గాదు. ఆర్థిక సమస్యలుంటాయి. రాజకీయులు జాగ్రత్తగా నడచుకోవాలి.




నిద్రలేమి, జ్వరంలాంటి అనారోగ్య బాధలు అధికంగా ఉంటాయి. గాయాల అవకాశం కలదు. ధన విషయంలో కటకట ఉండవచ్చు. బంధువులతో విరోధ ప్రాప్తి. ఒకటికి రెండుమారులు ఆలోచించి చేయడం మంచిది. వ్యాపారులకు అమ్మకాలు తగ్గుముఖం పడతాయి. ఉద్యోగులకు అతికష్టంగా సాగుతుంది. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది. రాజకీయులకు దురదృష్టకాలం.




ఆరోగ్య విషయాలలో పెద్ద ఇబ్బందులు లేకపోయినా ఊపిరితిత్తులకు, పాదాలకు సంబంధించి ఇబ్బందులుంటాయి. ఆస్మా పీడితులకు అధిక బాధ. బంధువుల మూలంగా సాయం పొందుతారు. వ్యాపారులకు భాగస్వాముల మూలంగా మంచి లాభప్రాప్తి ఉంటుంది. రాజకీయులు లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు. ఉద్యోగులకు శ్రమ అధికం. సరైన ప్రోత్సాహం ఉండదు. విద్యార్థులకు వృథా కాలక్షేపం.




ఆరోగ్య విషయాలు చక్కగా ఉంటాయి. సోదరుల మూలంగా మానసిక వేదనకు గురౌవుతారు. ధన విషయంలో తండ్రి, సోదరులతో గొడవలు రావచ్చు. ఆర్థిక విషయాలు అంతంతమాత్రమే. ఇరుగు పొరుగువారి సహాయం అందవచ్చు. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. ఉద్యోగులకు ఎదురు చూచినవి లభించవచ్చు. రాజకీయులకు తీరని వేదన చోటుచేసుకొంటుంది.




ఆకస్మిక ఖర్చులు ఆవేదనను కల్గిస్తాయి. జ్వరం, నిద్రలేమి, గొంతులో అనారోగ్య బాధలుంటాయి. పాదాలకు గాయాలు తగిలే అవకాశం. కళత్రంతో గొడవలుండవచ్చు. ధనవిషయాలలో లోటు లేదు. రుణ రూపంలో ధనప్రాప్తి. భాగస్వాములు మోసగించే అవకాశాలున్నాయి. ఆదాయం తక్కువ. ఉద్యోగులకు ప్రమోషన్ లేదా ఆదాయవృద్ధి ఉండవచ్చు. రాజకీయులకు ఉత్తమకాలం. విద్యార్థులకు శ్రమ.

# నూతన గృహాలు – బలినిదాన, విధాన ప్రభావిష్కరణలు!

ఎం.వనితాసుబ్బారెడ్డి చెన్నై

* *క్రొత్త ఇళ్లలోకి చేరేటప్పుడు పాటించవలసిన శాస్త్ర విధానాల్ని చెప్పండి?*

క్రొత్త గృహాల్లో శాస్త్రీయ, సాంప్రదాయ సాత్విక బలులు బలి, నిదాన, విధానాలని మూడు విధాలుగా సమర్పణలు చేసి చేరాలి. మండలం రోజుల తర్వాత సమస్యలుంటే తత్సంబంధమైన యంత్రాన్ని ప్రతిష్ఠించుకోవాలి.

ఐ.ఉమామహేశ్వరరావు చెన్నై

* *నేను వాస్తు రిసెర్చ్ విద్యార్థిని. భూమి విభాగాలెన్ని? ఏ గ్రంథంలో వాటి వివరణ వున్నది?*

వశిష్ట మహర్షి కృతమైన క్షేత్రార్పణంలో నివాస భూమిని గజపృష్టం మంచి బృహన్ముఖం, సంస్థిత నివాస భూములుగా విభజించారు.

సినగారి మాధవి తిరుపతి

* *చిన్నమ్మాయికి అనారోగ్యం. చదువు కొనసాగడం లేదు.*

ఉత్తర దోషాలు చిన్న కుమార్తెపై చూపిస్తాయి. వెంటనే కుబేర యంత్ర ప్రతిష్ట చేసి, రుద్రాక్ష పూజా విధానాన్ని మండలం రోజులు అమ్మాయి చేత ఆచరింపజేయండి.

ఎం.ఆర్.సువర్చల చిత్తూరు

* *దేవుడు ఈశాన్యం మండపంలో వున్నాడు. ఏ పనిచేసినా కలిసి రావడం లేదు.*

ఈశాన్య గదిలో ఈశాన్యం చూడాలి దేవుడు. ఈశాన్యంలో మండప నిర్మాణం వల్ల ఆ ప్రాంతం బరువై వ్యాధి, అనార్థిక బాధలు సంప్రాప్తమౌతాయి. ఈశాన్యం గదిలో దేవుడు సూర్యాస్తమయాన్ని చూస్తే ఆ ఇల్లు కలసిరాదు.

బసివినేని కృష్ణారావు హైదరాబాద్

* *అపార్టుమెంట్లు ఎక్కువైపోయి నివాస గృహాలు తక్కువై పోయాయి.*

మర్రి చెట్టు నీడలోని మొక్కలై పోతాయి– ఇళ్లు – వాతావరణ కాలుష్యంతోపాటు, నీటి స్థాయి కూడా గణనీయంగా తగ్గిపోతుంది. అపార్టుమెంటు నీడ ఇళ్లకు భూతచ్ఛాయ.

కె.సునీతావిఠల్ నెల్లూరు

* *అబ్బాయి మాట వినడం లేదు. అమ్మాయి కాపురంలో కూడా కలతలెక్కువై పోయాయి.*

వాస్తు దోషాలనుబట్టి 'సుదర్శన యంత్రం' మీ సమస్యల్ని పరిష్కరిస్తుంది. అమ్మాయి కుడి చిటికెన వ్రేలికి నీలం(ప్రధమార్ధ) ధరింప జేయండి.

పర్వతం సింధుజ నాయుడుపేట

* *భార్యాభర్తల నక్షత్రాలను బట్టి ఇల్లు నిర్మించుకోవాలా?*

భార్యాభర్తలకు అభివృద్ధిని సూచించే స్థలం, అంతరంలో బ్రహ్మ, నాభి, చతుర్విధ స్థానాలు సరిదిద్దుకోవడం వల్ల ఆర్థిక, ఆరోగ్య పరిస్థితులకు దోకా ఉండదు.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

కె.సుదర్శనరావు రాపూరు

* *ప్లాటు, అపార్టుమెంటు దిక్కులు పెరిగి వున్నాయి. తూర్పు ద్వారం. తీసుకోవచ్చా?*

ఏది, ఏ దిక్కు పెరిగిన స్థలమైనా, గృహమైనా తీసుకోకపోవడమే మంచిది. దక్షిణ రోడ్డు వుండి తూర్పు, పడమరల వైపు ప్లాట్లు వుంటే అసలు తీసుకోకండి. వ్యతిరేక ఫలితాలుంటాయి.

ఎన్.ఆర్.విదిశారెడ్డి హైదరాబాద్

* *అపార్టుమెంటుకు ఎన్ని సెప్టిక్ ట్యాంకులు నిర్మించుకోవచ్చు.*

ఏ నిర్మాణానికైనా రెండింటికి మించి సెప్టిక్ ట్యాంకు నిర్మాణాలు కాంపౌండ్ లోపలే జరగాలి. బయట జరిగితే అనారోగ్య సమస్యలు ప్రారంభమవుతాయి.

కె.వి.కృపానందం బాపట్ల

* *కోర్టు కేసులో వుండి ఈ మధ్య పరిష్కారమయింది. ఆ ఇల్లు కొనుగోలు చేయవచ్చా?*

నలభై రోజులకు పైగా మూతబడిన ఇళ్లలో దుష్టశక్తులు చేరుతాయి. శాంతి, బలి, పూజ, దిష్టి వంటి చతుర్విధ శాంతులు జరిపించగలిగితే ఆ గృహాన్ని తీసుకోవచ్చు.

ఇ.వి.శ్యాంప్రసాద్‌రెడ్డి సూళ్లూరుపేట

* *రోడ్డుకేమో స్థలం ఎదురుగా వున్నట్లే వుంటుంది. వెనుకవైపు ఇంటి మూలలు మా యింటికి తగులుతున్నాయి.*

'లేఅవుట్'లోని లోపాల వల్ల స్థలాలు ఇలా దిక్కుమాలినవిగా తయారై వాస్తు లోపాలు కలిగి వుంటాయి. వీటిని కొనకపోవడమే మంచిది.

# కలువాయి కేంద్రంగా ఎర్రచందనం స్మగ్లింగ్!

**సులభంగా డబ్బులు సంపాదించాలన్న ఏకైక లక్ష్యంగా కలువాయిలోని కొందరు యువకులు ఎర్రచందనం స్మగ్లింగ్ వ్యాపారంలో దిగారు.**

జిల్లాలోని కలువాయి కేంద్రంగా ఎర్రచందనం తరలిస్తున్నారు. కలువాయికి చెందిన కొందరు యువకులు సులభంగా డబ్బు సంపాదించాలన్న ఆశతో ఓ ముఠాగా ఏర్పడి ఈ వ్యాపారాన్ని ఎంచుకొంటున్నారు. ఎర్రచందనం వ్యాపారంలో పెట్టిన పెట్టుబడికి ఐదురెట్లు ఆదాయం వస్తుండడంతో కొందరు వ్యాపారస్తులతోపాటు ఒక విఆర్వో ఆర్థికసాయం చేస్తున్నట్లు తెలుస్తుంది. కలువాయి మండలంలో ఎర్రచందనం వ్యాపారం జరుగుతున్న విషయం అటవీశాఖ, పోలీసు అధికారులకు తెలిసినా ఎటువంటి చర్యలు తీసుకోవడం లేదన్న ఆరోపణలు వున్నాయి.

సంబంధితశాఖ అధికారులకు నెలసరి మామూళ్లు అందుతుండడంతో ఎర్రచందనం దుంగలు సరిహద్దు దాటిపోతున్నాయి. మామూళ్లు అందని పక్షంలో మాత్రమే అడపాదడపా అధికారులు దాడులు చేస్తుంటారు. ఎర్రచందనం దుంగలను ఐదు వాహనాల్లో తరలిస్తుంటారు. అధికారుల దాడుల్లో ఒక వాహనం మాత్రమే పట్టుబడుతుండగా మిలిగిన నాలుగు వాహనాలు వివిధ మార్గాల్లో గమ్యం చేరుకోగలుగుతున్నాయి. ఇటీవల కలువాయికి చెందిన ఈ ముఠాలోని కీలకవ్యక్తి ఎర్రచందనం లారీతోసహా పట్టుబడ్డాడు. పట్టుబడిన వ్యక్తిని కలువాయి పోలీసులు పొదలకూరు సిఐకి అప్పగించారు. రాజకీయ నేతల నుంచి ఫోన్ల ద్వారా ఒత్తిడి రావడంతో వదిలేయడం జరిగింది.

ఇందులో దాదాపు పాతికలక్షల రూపాయలు చేతులు మారినట్లు ప్రచారం జరిగింది. పట్టుబడ్డ వ్యక్తిని వదిలేయడంతో తిరిగి మరుసటి రోజు నుంచి ఎర్రచందనం స్మగ్లింగ్ నిరాటకంగా కొనసాగిస్తున్నట్లు సమాచారం. పట్టుకొన్న కానిస్టేబుళ్లకు మాత్రం బెదిరింపు ఫోన్‌కాల్స్ వస్తున్నాయి. నన్నే పట్టుకొంటారా? మీ అంతు చూస్తానంటూ హెచ్చరికలు వస్తున్నాయి. ఈ మండలంలో ఎర్రచందనం స్మగ్లింగ్ కోసం దినసరి కూలీలను వినియోగిస్తున్నారు. మెట్ట ప్రాంతం కావడం వలన కూలీ పనులు వుండవు. దీంతో ఎర్రచందనం దుంగలను తరలించేందుకు వెళ్తే రోజుకు వెయ్యిరూపాయలు లభిస్తుంటుంది. దీంతో ఎక్కువ మంది ఈ పనులకు వెళుతున్నారు. కూలీలను పావులుగా వాడుకొంటూ అసలు స్మగ్లర్లు సులభంగా తప్పించుకొంటున్నారు.



**ఎర్రచందనం దుంగలను అక్రమ రవాణా చేస్తుండిన వ్యాన్‌ను పోలీసులు అదుపులో తీసుకొన్న దృశ్యం.**

## పంథామారుస్తున్న స్మగ్లర్లు

అడవుల నుంచి ఎర్రచందనం దుంగలను తరలించేందుకు స్మగ్లర్లు కొత్త పంథాను అనుసరిస్తున్నారు. ఇప్పటివరకు ఒకే వాహనంలో దుంగలను తరలించడంతో అటవీశాఖ అధికారులు, పోలీసులకు పట్టుబడేవారు. దీంతో పోలీసులబారీ నుంచి తప్పించుకొనేందుకు ఇసుకలారీలు, ధాన్యం తీసుకెళ్లే లారీలను వినియోగిస్తున్నారు. ఇసుక, గ్రావెల్, ధాన్యం క్రింద దుంగలనుంచి తరలిస్తున్నారు. ఎక్కడైనా పోలీసులు తనిఖీలు చేస్తే పైన ధాన్యం బస్తాలుగాని, ఇసుకగానీ దర్శన మిస్తుండడంతో వదిలేస్తున్నారు. ఈ వాహనాలకు భారీ స్థాయిలోనే బాడుగ చెల్లిస్తుండడంతో ఎవరికి అనుమానం రాకుండా కొనసాగుతోంది.

అడవి నుంచి ఎర్రచందనం ఇతర ప్రాంతాలకు తరలిపోతున్నా నియంత్రించేందుకు పటిష్టమైన చర్యలు తీసుకోలేకపోతున్నారు. ఒకవేళ పట్టుబడితే వాహనాలు మాత్రమే దొరుకుతున్నాయి. నిందితులు మాత్రం ఏదోఒక విధంగా తప్పించుకొంటున్నారు. రాజకీయ ఒత్తిళ్లు, మామూళ్ల కారణంగా సంబంధితశాఖ అధికారులు చేతులెత్తేస్తున్నారు. కోట్ల రూపాయలు విలువ చేసే అటవీ సంపదను పరిరక్షించేందుకు ప్రభుత్వం కఠినంగా వ్యవహరించాల్సిన అవసరం వుంది.

**విద్యా హక్కు చట్టం**

# చిక్కులు తేనున్న విద్యాహక్కు చట్టం!

**కొత్త చట్టం ప్రకారం ఒకే గ్రామంలోని రెండు పాఠశాలల్లో ఒకదానిని ఎత్తి వేసేందుకు రంగం సిద్ధం చేస్తుండడంతో ఉపాధ్యాయులతోపాటు ప్రజల్లో ఆందోళన నెలకొనివుంది.**

కేంద్ర ప్రభుత్వం ప్రవేశ పెట్టిన విద్యాహక్కు చట్టంతో కొత్త చిక్కులు ఏర్పడ్డాయి. కిలోమీటరు పరిధిలో పాఠశాలను ఏర్పాటు చేయాలన్న నిబంధన విధించడంతో విద్యాశాఖ అధికారులు తలలు పట్టుకొంటున్నారు. ఇలా చేయడంతో గ్రామీణ ప్రాంతాల ప్రజలు ఒకప్రక్క నిరసనలు వ్యక్తం చేస్తుండగా, మరో ప్రక్క విద్యాశాఖ అధికారులకు ఆదేశాలు అమలు చేయాలని హెచ్చరిస్తున్నారు. ఇప్పటి వరకు ఒక్కో గ్రామంలోని దళితవాడలో పాఠశాలలు ఏర్పాటై వున్నాయి. కిలోమీటరు దూరంలో పాఠశాల వుండాలన్న ఆదేశాలు అందడంతో ప్రస్తుతం వున్న పాఠశాలను ఎక్కడికి తరలించాలన్న దానిపై తర్జన భర్జన పడుతున్నారు.

1వ తరగతి నుండి 8వ తరగతి వరకూ ప్రాథమిక విద్యగా గుర్తిస్తూ ప్రభుత్వం ఉత్తర్వులున్నాయి. విద్యాహక్కు చట్టం అమలు గురించి, కిలోమీటరు పరిధిలో పాఠశాలలున్న గ్రామాలు, లేని గ్రామాల సర్వే కూడా పూర్తి చేశారు. జిల్లాలో రాజీవ్ విద్యామిషన్ ఆధ్వర్యంలో ఈ సర్వే కార్యక్రమం జరిగింది. పూర్తి వివరాలతో కూడిన నివేదికలను సైతం సిద్దం చేశారు. ప్రజల నుంచి అభ్యంతరాలను స్వీకరించాలని నిర్ణయించి ఇందుకు సంబంధించిన నోటిఫికేషన్‌ను ఇటీవల జారీ చేశారు.

విద్యా హక్కు చట్టంలో భాగంగా ఒకే గ్రామంలో ఏర్పాటుచేసి వున్న రెండు పాఠశాలలను ఎత్తివేసేందుకు రంగం సిద్ధం చేస్తున్నారు. ఈ ప్రభుత్వ ఉత్తర్వుల కారణంగా రాజీవ్ విద్యా మిషన్ అధికారులతోపాటు కొందరు ఉపాధ్యాయులు గందరగోళానికి గురవుతున్నారు. వేసవి సెలవుల అనంతరం పాఠశాలలు పునః ప్రారంభమయ్యే నాటికి కిలోమీటరు దూరంలో పాఠశాలను ఏర్పాటు చేయడంతోపాటు ఒకే గ్రామంలో వున్న రెండు పాఠశాలల్లో ఒకదానిని వేరే ప్రాంతానికి తరలిస్తారు. ఇప్పటికే పాఠశాలలో ప్రవేశం పొందిన బాలబాలికలను వారి కోరికను బట్టి వేరే పాఠశాలలో విలీనం చేయనున్నట్లు అధికారులు చెబుతున్నారు.

బాలబాలికల ఉచిత నిర్బంధ విద్యా హక్కు చట్టం రూపొందించడంపై మొదటి నుంచి ఉపాధ్యాయ సంఘాలు అభ్యంతరం వ్యక్తం చేస్తూనే వున్నాయి. ఈ చట్టం కార్పొరేట్ విద్యాసంస్థలకు ప్రయోజనం చేకూర్చే విధంగా వుందంటూ నిరసనలు కూడా వ్యక్తం అవుతున్నాయి. ఇందులో పూర్వ ప్రాథమిక విద్యకు ఎటువంటి గ్యారంటీ కల్పించ లేదు. 3 నుండి 5 సంవత్సరాల బాలబాలికలందరికీ పూర్వ ప్రాథమిక విద్య లభించాలనే నిబంధన చేర్చబడలేదు. ఈ చట్టంలో బాల్యాన్ని 6 నుండి 14 సంవత్సరాలుగా మాత్రమే గుర్తించింది. ఈ చట్టంలో పూర్వ ప్రాథమిక విద్యను చేర్చాలని మేధావులు, ఉపాధ్యాయ సంఘ నేతలు డిమాండ్ చేస్తున్నారు.

విద్య, పాఠశాలల పట్ల ప్రభుత్వం అనుసరిస్తున్న విధానం పట్ల అధికారులు కూడా అసహనం వ్యక్తం చేస్తున్నారు. హక్కు చట్టం పేరుతో గ్రామీణ ప్రాంతాలతోపాటు పట్టణ ప్రాంతాల్లో కూడా కొన్ని పాఠశాలలు ఎత్తివేయనున్నారు. ఇందుకోసం రాజీవ్ విద్యామిషన్, విద్యాశాఖ అధికారులు కసరత్తు చేస్తున్నారు. 2011 – 12 విద్యా సంవత్సరం ప్రారంభమయ్యేలోగా పాఠశాలల విలీనం ప్రక్రియ పూర్తి చేసే అవకాశం వుంది. J



## నిత్యమీనన్ రూటే వేరు!

అలా మొదలైంది చిత్రంతో తెలుగు తెరపైకి దూసుకొచ్చిన మళయాళ ముద్దుగొమ్మ నిత్యమీనన్. ఈ చిత్రం విజయం సాధించడంతో బోలెడు సినిమాల్లో నటించే అవకాశం దక్కింది. అయితే ఆమె కథ, స్క్రిప్ట్ నచ్చితేనే సినిమాలో నటిస్తానంటుంది. వెంకటేష్ సరసన నటించమంటే 'నో' అంది. విషయమేమిటని అడిగితే నేను పెద్ద హీరోతో నటిస్తున్నానని గొప్పగా చెప్పుకోవచ్చు. ఆ పేరుతో తెలుగులో మరిన్ని అవకాశాలు సాధించవచ్చు కానీ నాకు అది ఇష్టం లేదు. వెంకటేష్ సినిమాలో నటిస్తే నాకు మేలు జరుగుతుందే మోగానీ... ఆ సినిమాకు సరైన న్యాయం జరగకపోవచ్చని అనిపించడం వల్ల అలా చెప్పానంటుంది. షరతులతో నిత్య ఎన్నాళ్ల పరిశ్రమలో నెట్టుకొస్తుందో చూద్దాం!



## కొత్తందం!

నిరంతరం క్రొత్త హీరోయిన్ల అన్వేషణలో వుంటారు దర్శక నిర్మాతలు. కొత్త నీరు వస్తేనే కదా జనాన్ని ఆకట్టుకోగలిగేది అంటుంటారు. హీరో పవన్‌కళ్యాణ్ త్వరలో షాడో అనే చిత్రంలో నటించబోతున్నాడు. ఈ సినిమాలో ఆయన సరసన సారాజేన్ అనే అందాల భామ నటించబోతోంది. ముంబాయికి చెందిన సారా ఇటీవలే 'గేమ్' అనే చిత్రంలో నటించింది. తెలుగులో ఆమెకిదే తొలిచిత్రం. తమిళంలో ఓ సినిమా చేసింది... విశాల్‌తో. మోడల్‌గా అనుభవం వున్న సారా అందాల ఆరబోతకు పెద్దగా అడ్డుచెప్పదని హిందీ జనాలు చెబుతున్నారు. అంటే మన ప్రేక్షకుల కనువిందుకి లోటుండదన్న మాట.



## కరీనానే టాప్!

బాలీవుడ్‌లో ప్రస్తుతం టాప్-10 భామలు ఎవరు? అనే దానిపై ఇటీవల ఓ సర్వే నిర్వహించారు. ఈ సర్వేలో కరీనా కపూర్‌కు ప్రథమస్థానం దక్కింది. ఎప్పుడూ ఏదో ఒక రూపంలో వార్తల్లో వుండే కరీనా ఈ స్థానం దక్కించుకోవడంలో ఆశ్చర్యమేముంది? ఇక రెండో స్థానంలో కత్రినా కైఫ్ నిలవగా, మూడవ స్థానం దీపిక వశమయ్యింది. ప్రియాంక చోప్రా నాలుగోస్థానంతో సరిపెట్టుకోగా, నాలుగు పదులకు చేరువవుతున్న ఐశ్వర్యారాయ్ అయిదో స్థానంతో తృప్తి పడాల్సివచ్చింది. ఇక విద్యాబాలన్ ఆరోస్థానంలో నిలవగా, అనుష్కశర్మ, సోనమ్ కపూర్ ఏడు, ఎనిమిది స్థానాల్లో నిలిచారు. కంగనా రనౌత్, సోనాక్షి సిన్హా చివరి స్థానాలలో నిలవడం విశేషం.

## ఎన్టీఆర్ బిజీ!



పెళ్లి పనుల్లో హీరో ఎన్టీఆర్ బిజీగా వున్నాడు. బంగారం, పెళ్లివస్త్రాల కొనుగోలు, షాపింగ్ అంటూ హడావుడిగా కనిపిస్తున్నాడు. ఆయన్ను కదిలిస్తే పెళ్లి రోజున సంప్రదాయబద్ధంగా పట్టు వస్త్రాలతో కనిపిస్తా. ఆరోజు పెళ్లి కూతురు ప్రణతి ఏ రంగు చీరకట్టినా ఓకే. షూటింగ్‌లకు నెల రోజులు సెలవు తీసుకొన్నాను. హనీమూన్‌కు ఎక్కడికి వెళ్లాలో ఇంకా తేల్చుకోలేదు. నేను ప్రణతి కలిసి శక్తి సినిమా చూసామంటున్నాడు ఈ యువ హీరో. ఆ చిత్రంలోని ప్రేమదేశం యువరాణీ పాట ప్రణతికి బాగా నచ్చిందని చెప్పుకొచ్చాడు.



## అయోమయంలో నమిత

సన్నబడితే అవకాశాలొస్తాయి కదాని కొని హీరోయిన్ నమిత రకరకాల వ్యాయామాలు చేసి బరువు తగ్గింది. తమిళ దర్శకులు కొందరు ఇలాగైతే ఎలా? నువ్వు లావుగా వుంటేనే మాస్ ప్రేక్షకులు ఇష్టపడతున్నారు అంటూ చెప్పేసరికి నమితకు ఏం చేయాలో పాలుపోలేదు. తెలుగులో అవకాశాల కోసం ఈ మధ్య ఎక్కువగా ప్రయత్నాలు చేసింది. సింహాలో ఆమె చేసిన మాస్ సాంగ్ సింహమంటి చిన్నోడే' పాటలో ఇంకాస్త సన్నగా వుంటే బాగుండేదని ప్రేక్షకులు, తెలుగు నిర్మాతలు అనే సరికి సన్నబడింది. దీనిమూలంగా తమిళ చిత్రాలు ఎక్కడ లేకుండా పోతాయోయన్న భయాన్ని నమిత సన్నిహితుల వద్ద వ్యక్తం చేస్తుంది.

## మిస్టర్ పర్‌ఫెక్ట్‌గా లేడు!



✍ అల్లూరు రహీం

అనుకున్న పనిని పర్‌ఫెక్ట్‌గా సాధించాలంటే సర్దుకుపోతే కుదరదని నేటితరం భావిస్తోంది. కెరీర్‌లోనూ, జీవితంలోనూ ఎంతవరకు సర్దుకుపోవాలో చెప్పే ఫిలాసఫీయే మిస్టర్ పర్‌ఫెక్ట్ సినిమా. దీనికి దిల్‌రాజు నిర్మాత. ఆయనకు ఈ సినిమాలోని సెంట్రల్ పాయింట్ మూడేళ్ల క్రితం తట్టిందట. దాన్ని కుటుంబ బంధాలు, చక్కటి భావోద్వేగాలు పలికించే సంతోషం ఫేం దర్శకుడు దశరథ్‌కు చెప్పి మిస్టర్ పర్‌ఫెక్ట్ సినిమాగా మలిచాడు. హీరో ఆస్ట్రేలియాలో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ కాబట్టి సిడ్నీ నగరంలో కథ నడిపారు. చూపరులను ఆకట్టుకొనే సిక్లిఫ్ బ్రిడ్జిని అందంగా చూపను హెలికాప్టర్‌తో షూటింగ్ చేశారు. పోరాటాల కోసం ప్రపంచంలో పేరుగాంచిన ఫైటర్లను వాడారు. హీరో ప్రభాస్ చేత హీరోయిన్ తాప్సీకి నాలుగు వేడి ముద్దులు పెట్టించారు. అబ్బూరి రవి చేత పేజీలకు పేజీలు డైలాగులు చెప్పించారు. కాఫీలో డికాషన్ ఎక్కువైతే తాగడం కష్టం. నత్తనడత స్క్రీన్‌ప్లేతో మిస్టర్ పర్‌ఫెక్ట్ సాగదీసిన తీరును ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ఈ చిత్రంలో ఒకచోట చెప్పినట్లు ప్రతివ్యక్తి తాను మిస్టర్ పర్‌ఫెక్ట్ ననుకొంటాడు. కాని ఈ విషయం తోటివాళ్లు చెప్పాలన్నట్లు – ఈ చిత్రం చూసినవాళ్లే అంత పర్‌ఫెక్ట్‌గా లేదని చెప్పేస్తారు. ఈ చిత్రానికి మొదటి మైనస్ పాయింట్ దేవిశ్రీ ప్రసాద్ సంగీతం. ఆయన పాటలన్నింటికీ పాత బీట్స్ వాడారు. రావుగారి అబ్బాయి, అగ్గిపుల్ల లాంటి ఆడపిల్ల, డోలు డోలు బాజే చరణాలతో సాగే పాటలు ఇంతకముందు విన్నట్లే వుంటాయి. చలి చలిగా వుంది పాట మాత్రం పరవాలేదు. గ్రామీణ నేపథ్యంలో జరిగే కథను తమిళనాడులోని పొలాచి పొలాల్లో అందంగా చిత్రీకరించిన కెమెరామెన్ విజయ్ కె.చక్రవర్తి అభినందనీయుడు. ఆస్ట్రేలియాలోని సన్నివేశాలను ఆయన ఇంత అందంగా చూపలేకపోయాడు. బొమ్మరిల్లు ఫేం మాటల రచయిత అబ్బూరి రవి తన విలక్షణతను చాటుకొన్నాడు. అసలు ఈయన మాటలతోనే చిత్రం సాగిందనాలి. దేవుడు శాడిస్ట్ కాడు. మనం ఏది ఇస్తే అది తిరిగి వస్తుంది. ప్రేమలోనే కాదు పగలోనూ మనసులు మాట్లాడుకొంటాయి. టెక్నాలజి మనుషుల మధ్య దూరం పెంచుతుంది. నలుగురికి నచ్చిందే చేయాలి. ప్రేమలో ఓడిపోతే బాధ. అనుభవం కన్నా నమ్మకం గొప్పది. అభిప్రాయాలు కాదు మనసులు కలవాలి మచ్చుకు కొన్ని...

హీరో ప్రభాస్, హీరోయిన్ కాజల్ పడే జగడాలు ఆమెకు ప్రత్యేక లవ్ మెసేజ్ పంపడం, పాతమిత్రుల సంగమం, జల్సా కిషోర్‌గా బ్రహ్మానందం, మాస్టర్ భరత్ కాంబినేషన్‌లోని కామెడీ బాగుంది. ఆస్ట్రేలియా నేపథ్యంలో వచ్చే మరో హీరోయిన్ తాప్సికి పాత్ర తక్కువైనా యువప్రేక్షకులను సమ్మోహితులను చేస్తుంది. దిల్ వాలే దుల్హనియా లేజాయింగే చిత్రం మూసలో కొన్ని సన్నివేశాలు నడపడం కోసం డజన్ల కొద్దీ నటులను ఈ చిత్రంలో వాడాడు దర్శకుడు దశరథ్.

చిత్రకథ చిన్నదే. గ్రామీణ ప్రాంతీయులు నాజర్, మురళీమోహన్ చిన్నప్పటి నుంచి మిత్రులు. నాజర్ పట్టణానికి వచ్చి స్థిరపడతాడు. ఆయన కుమారుడు విక్కీ (ప్రభాస్) ఆస్ట్రేలియాలో యానిమేషన్ ఇంజనీర్‌గా పనిచేస్తుంటాడు. చెల్లెలి పెళ్లి కోసం స్వగ్రామం వచ్చిన విక్కీని తండ్రి తన స్నేహితుడు మురళీమోహన్ కుమార్తె ప్రియ (కాజల్)ను పెళ్లి చేసుకోమంటాడు. అభిప్రాయాలు కలిస్తే చూస్తానంటాడు. కొన్నాళ్ల పోట్లాట తర్వాత ప్రియనే విక్కీకి తగ్గట్టుగా అభిప్రాయాలు మార్చుకొంటుంది. నిశ్చితార్థం సమయంలో విక్కీ దీన్ని ఎత్తి




చూపి తిరిగి ఆస్ట్రేలియా వెళ్లిపోతాడు. అక్కడ ఆయన అభిప్రాయాలకు సరితూగే మ్యాగీ (తాప్సీ) పరిచయమవుతుంది. ఇంతకుముందే ఒకసారి విక్కీ తలబిరుసు తనానికి దిమ్మ తిరిగిన ఆమె తండ్రి కెపి (ప్రకాష్‌రాజ్) తమ ఇంట్లో జరిగే పెళ్లికి అతన్ని ఆహ్వానించి బంధువుల్లో కనీసం నలుగురికి అతను నచ్చితే కుమార్తెనిచ్చి పెళ్లి చేస్తానంటాడు. కెరీర్‌లో ఏదైనా సాధించాలంటే సర్దుకపోకూడదు. సర్దుకపోతే ఓడిపోతాం అనే నిశ్చితాభిప్రాయముండే విక్కీ కుటుంబ సంబంధాలను నిలబెట్టుకోవడానికి సర్దుకపోవాలి. సర్దుకపోవడం వల్ల ఓడిపోవచ్చు. కాని ఓడిపోయి ఆత్మీయతలు గెలుచుకోవచ్చని తెలుసుకొంటాడు. విక్కీ మారడం మ్యాగీకి నచ్చదు. కాని ఈ పెళ్లికి బంధువుగా వచ్చిన ప్రియ అతనికి దగ్గరవ్వడంతో మిస్టర్ పర్‌ఫెక్ట్‌ను ఆమె స్వంతం చేసుకొంటుంది. అందంగా వుండే ప్రభాస్‌కు వెరైటీ కోసమంటూ చిత్రవిచిత్రమైన మేకప్ చేయడం బాగాలేదు. హీరోయిన్ కాజల్‌ను దర్శకుడు క్యారక్టర్ ఆర్టిస్ట్‌లా చిత్రంలో వాడుకొన్నాడు. ఖచ్చితంగా చెప్పాలంటే మిస్టర్ పర్‌ఫెక్ట్ పేరుకు తగ్గట్టు లేదు.

# తెలుగు భాషను రక్షించుకొందాం!


భాషా పరిరక్షణ వేదిక సదస్సులో మాట్లాడుతున్న ఘంటసాల రత్నకుమార్.

తెలుగు భాష పరిపరి విధాల కలుషితమై పోయిందని, దాన్ని పరిరక్షించుకోవాల్సిన బాధ్యత ప్రతి తెలుగు వాడిపై వుందని సినీ గేయ రచయిత వెన్నెలకంటి రాజేశ్వర ప్రసాద్ పిలుపునిచ్చారు. 23వ తేది టౌన్‌హాలులో తెలుగు భాషా పరిరక్షణ వేదిక ఆధ్వర్యంలో తెలుగు భాష పరిరక్షణ, పరిపోషణ అనే అంశంపై చర్చా వేదిక నిర్వహించారు. ఈ సమావేశంలో ఆయన మాట్లాడుతూ ప్రస్తుతం తెలుగు పదాలను చూస్తే ఆవేదన చెందాల్సివస్తోందన్నారు. పదాలు, పలుకులు పూర్తిగా మారిపోయాయన్నారు. ప్రముఖ గాయకుడు ఘంటసాల రత్నకుమార్ మాట్లాడుతూ సాహిత్య విలువలు పూర్తిగా పతనమయ్యాయన్నారు. ఆధునిక రంగుపూసి ఆంగ్ల భాషను వినియోగించడం ఫ్యాషన్‌గా మారడం దురదృష్టకరమన్నారు. తెలుగు భాష వాడుకలో ఒత్తులు వుండడం లేదని, అర్థాలు చెడిపోయే విధంగా తెలుగు భాష వినియోగం వుండడం బాధాకరమన్నారు. సభికులు భాషపై అడిగిన పలు సందేహాలను వెన్నెలకంటి, కెవిఆర్ మూర్తి, ఎం.సంపత్‌కుమార్ తదితరులు తీర్చారు. వక్త సగిణి సుధారాణి కూడా ఈ సభలో పాల్గొన్నారు.

# బ్లాక్‌లో సినిమా టిక్కెట్లు!

**సగటు ప్రేక్షకునికి ఏదీ వినోదం?**


టిక్కెట్ల కోసం సినిమా హాల్ వద్ద ప్రేక్షకుల నిరీక్షణ.

అభిమాన కథానాయకుడు సినిమా చూడాలనుకొనే ప్రేక్షకులను బ్లాక్ టిక్కెట్ల నిర్వాహకులు దడ పుట్టిస్తున్నారు. సాధారణంగా సినిమా హాళ్ళ వద్ద టిక్కెట్లు పదో, పాతికో అమ్ముకొనే వారు కొందరు ఇటీవల అభిమాన సంఘాల ముసుగులో కొందరు రాజకీయ నాయకుల అండదండలు, పలుకుబడి గలవారు ఏకమొత్తంగా సినిమా టిక్కెట్లన్నింటినీ కొనేసి ఇష్టానుసారంగా అమ్ముకోవడం ఇటీవల కాలంలో అధికమయ్యింది. కొందరు పంపిణీదారులు సైతం అన్ని టిక్కెట్లను బ్లాక్ చేసి ఒక్కో టిక్కెట్‌ను రెండొందల నుంచి నాలుగు వందల రూపాయల వరకు అమ్ముకొని సొమ్ము చేసుకొంటున్నారట. లక్షలుపోసి కొన్న సినిమా ఎన్ని రోజులకు లాభం వస్తుందో, అసలు వస్తుందో రాదో తెలియనందు వల్ల బ్లాక్‌లో మూడు, నాలుగు రోజులపాటు అమ్మించి జేబులు నింపుకొంటున్నారు. రాజకీయ నేతల ముసుగులో మరికొందరు అడ్వాన్స్‌డ్ టిక్కెట్లను అందించే ఈ - సేవా కేంద్రాల్లో సైతం ఏకమొత్తంగా టిక్కెట్లను కొనుగోలు చేస్తున్నారు. దీంతో ఈ - సేవ కేంద్రాలకు వెళ్లిన వారికి టిక్కెట్లు అయిపోయిన సమాధానం వినవస్తుంది. ఇక సినిమా హాళ్లలో ఒక్కో టిక్కెట్టు ఇస్తున్న దాఖలాలు లేవు. ఇటీవల విడుదలైన కొత్త సినిమాలన్నింటి పరిస్థితి ఇంతే.

# రిజిస్ట్రేషన్లలో నెల్లూరు ఫస్ట్!

**పరిశ్రమల రాక కారణం**


నెల్లూరు రిజిస్ట్రేషన్ ఆఫీసు వద్ద సందడే సందడి.

రాష్ట్ర ప్రభుత్వానికి ఆదాయాన్ని సమకూర్చి పెట్టే శాఖల్లో రిజిస్ట్రేషన్ శాఖ ఒకటి. జిల్లాలో ఈ శాఖ ప్రభుత్వం ఇచ్చిన లక్ష్యాన్ని అధిగమించి అధికంగా ఆర్జించి పెట్టడంలో రాష్ట్రంలోనే ప్రథమంగా నిలచింది. గత ఏడాది ఆర్థిక మాంద్యం, భూముల క్రయ విక్రయాలు మందగించడంతో ఆ ప్రభావం రిజిస్ట్రేషన్లపై పడింది. క్రమేణా భూముల ధరలకు రెక్కలు రావడం, రియల్‌ఎస్టేట్ వ్యాపారం ఊపందుకోవడం, భూముల అమ్మకాలు, కొనుగోళ్ల పెరగడంతో రిజిస్ట్రేషన్‌లు పెరిగాయి. ఫలితంగా సంబంధిత శాఖకు ఆదాయం సమకూరింది. ఈ ఏడాదికి ప్రభుత్వం 141 కోట్ల రూపాయలు లక్ష్యంగా నిర్ణయించగా ఇప్పటికే 181 కోట్ల రూపాయలు రాబడి సాధించడం విశేషం. నెల్లూరు, గూడూరుల్లోని రిజిస్ట్రేషన్ కార్యాలయాలను పరిశీలిస్తే నెల్లూరుకంటే గూడూరు శాఖ అధికంగా ఆదాయం సమకూర్చుకొంది. గూడూరు చుట్టుప్రక్కల పారిశ్రామికాభివృద్ధి చెందడం, వివిధ వ్యాపార సంస్థలు ఏర్పాటు కావడంతో భూముల ధరలు పెరిగాయి. ఆ ప్రభావం రిజిస్ట్రేషన్‌లపై పడి అనుకొన్నదానికంటే అదనంగా వసూళ్లయ్యాయి.

# జిల్లా ప్రభుత్వాసుపత్రిలో ఆడిటింగ్




వైద్య విధాన పరిషత్ ద్వారా జిల్లాలో ఆస్పత్రులకు విడుదలైన నిధులపై ఇటీవల ఆడిట్ నిర్వహించారు. నెల్లూరు నగరంతోపాటు కావలి, గూడూరులలో వున్న ఆసుపత్రులకు రాష్ట్ర వైద్య విధాన పరిషత్ నుంచి నిధుల విడుదల జరుగుతుంది. విడుదల చేసిన నిధులను దేనికి ఖర్చు చేస్తున్నారన్న దానిపై హైదరాబాద్ నుంచి వచ్చిన రెండు ఆడిటింగ్ బృందాలు నగదు ఖర్చుకు సంబంధించిన రికార్డులను సమగ్రంగా పరిశీలించాయి. నెల్లూరు నగరంలో జిల్లా ప్రధాన వైద్యశాల, రేబాల చిన్న పిల్లల ఆసుపత్రి, టిబి ఆసుపత్రి, జూబ్లీ మెటర్నిటీ ఆసుపత్రులు వున్నాయి. వీటి నిర్వహణ, అభివృద్ధికి సంబంధించి నిధులు వున్నా వాటిని సక్రమంగా వినియోగించలేక పోతున్నారన్న ఆరోపణలు వున్నాయి. ప్రధానంగా పై ఆసుపత్రులలో డ్రైనేజి సమస్య, పారిశుద్ధ్యం సమస్యలు వున్నాయి. రెండు రోజులుగా ఆడిటింగ్ నిర్వహించిన అధికారులు గుర్తించిన లోపాలను చెప్పేందుకు నిరాకరించారు. ఆడిటింగ్‌లో బయటపడిన లోపాలను ప్రభుత్వానికి నివేదిస్తామని చెప్పారు.

# జనం తక్కువ... కార్డులెక్కువ!

**జిల్లాలో పరిస్థితిది**

జిల్లాలో కుటుంబాల కంటే రేషన్ కార్డులు ఎక్కువగా వుండడం ఆశ్చర్యపరుస్తోంది. రాజకీయ ఒత్తిళ్ల ఇతరత్రా కారణాలతో ఎన్ని సర్వేలు జరిపినా, మరెన్నో కార్డులు రద్దు చేసినా క్రొత్త కార్డులు పుట్టుకొస్తూనే వున్నాయి. ఇటీవల జరిపిన జనగణనలో జిల్లాలో కుటుంబాల సంఖ్య 7,71,528గా అధికారులు ప్రకటించారు. రేషన్‌కార్డుల సంఖ్యను పరిశీలిస్తే కుటుంబాలకంటే అధికంగా వుండడం విశేషం. మొత్తం 8,58,284 కార్డులు వున్నట్లు అధికారులు లెక్క తేల్చారు. దీన్నిబట్టి చూస్తే కుటుంబాల కంటే రేషన్ కార్డులు అధికంగా 86,758 వున్నాయి. ఇదికాక జనవరిలో జరిగిన రచ్చబండ కార్యక్రమంలో 1,14,405 దరఖాస్తులు రేషన్ కార్డుల కోసం వచ్చాయంటే కార్డుల పంపిణీలో ఎంతగా అవకతవకలు చోటుచేసుకొంటున్నాయో తెలుస్తుంది. గతంలో ఇబ్బడిముబ్బడిగా ఎవరికి పడితే వారికి అనర్హులకు తెల్లకార్డులు ఇవ్వడంతో వీటిని సరిదిద్దేందుకు 2010 సంవత్సరంలో అధికారులు పరిశీలన చేసి 1,50,498 బోగస్ కార్డులు వున్నట్లు తేల్చారు. కొన్ని ప్రాంతాలలో ఒకే కుటుంబంలో పది కార్డులు వున్న విషయం బయటపడితే ఈ పరిస్థితుల్లో తిరిగి రాజకీయ ఒత్తిళ్లతో కార్డులు రద్దు చేసిన తర్వాత తిరిగి మరలా 41,364 కార్డులను పంపిణీ చేశారు. ఇప్పుడు పరిస్థితి కుటుంబాల సంఖ్య కంటే కార్డుల సంఖ్య అధికం కావడంతో వీటిని ఎలా సరిచేయాలో తెలియక అధికారులు తలలు పట్టుకొంటున్నారు. ఇచ్చిన కార్డులు రద్దుచేస్తే జనం ఊరుకొనేటట్లు లేరు. ఉన్నతాధికారులు మాత్రం కనీస పరిశీలన చేయకుండా కార్డులు ఇచ్చేశారని రెవిన్యూ అధికారులను మొట్టుతున్నారు.


నెల్లూరులోని జైన్‌గోల్డ్ షోరూం మొదటి వారం నిర్వహించిన బంపర్ డ్రాలో విజేతను ప్రకటిస్తున్న ఆనం రంగమయూర్‌రెడ్డి. ప్రక్కన షోరూం అధినేతలు మణిలాల్‌జైన్, నరేంద్రజైన్.

# కాంగ్రెస్ ఆశలు గల్లంతు

మొదటి పేజీ కొరవ

పెద్ద తప్పే చేసింది కాంగ్రెస్ పార్టీ.

మరొకప్రక్క జగన్ ఘటనా ఘటన సమర్థుడు. రాజకీయ టక్కుటమార విద్యలన్నీ వుగ్గుపాలతో ఔపోసన పట్టినవాడు. చేతినిండా డబ్బు వుంది. ఎన్ని కోట్లయినా క్రుమ్మరించగల శక్తిపరుడు. మందీ మార్బలానికి లోటు లేదు. రెడ్డి కులం మొత్తం ఆయన వెనుక మొహరిస్తున్నది. ప్రచార సాధనాలను జగన్ వలే వాడుకొనే నేత దేశంలో మరొకడు కన్పించడు. అలనాటి హిట్లర్, గోబెల్స్ కూడా జగన్ ప్రచార సామర్థ్యం చూసి నివ్వెర పోవాల్సిందే. పచ్చి అబద్ధాన్ని పరమ నిజంగా ప్రజల మెదళ్లలోకి ఎక్కించడంలో జగన్‌కు సాటి రాగలవారు లేరు.

వైఎస్ సానుభూతి ఒక పక్క జగన్ సమర్థత మరొకప్రక్క కలిసి కడప ఎన్నికలలో జగన్‌కు ఓటు ప్రభంజనం సృష్టిస్తున్నాయి. అవినీతి, అభివృద్ధి, అధికారం వంటి వన్నీ వెనక్కు వెళ్లి, వైఎస్‌కు ఓటు వేయాలన్న కోరిక ఒక్కటే ఓటర్లలో పెల్లుబుకుతున్నది. ఈ ప్రభంజనం ముందు కాంగ్రెస్ ఆశలు గల్లంతు కాక తప్పదన్నది పరిశీలకులు చెప్పే జోస్యం.

## కడప, పులివెందుల బలహీనం

అయితే కాంగ్రెస్‌లో కానీ, తెలుగుదేశంలో కానీ ఇంకా కొంత ఆశ మిణుకు మిణుకు మంటూ మిగిలి వుంది అంటే, అందుకు కారణం కడప టౌన్, పులివెందుల నియోజకవర్గాలలో వున్న పరిస్థితి. కడప టౌన్‌లో వైఎస్ బావమరిది రవీంద్రనాథ్‌రెడ్డి గత ఆరేడేళ్లలో చేసిన అరాచకాలు అన్నీ ఇన్నీ కావు. నగర అభివృద్ధి కోసం వైఎస్ పంపిన డబ్బు, చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలన్నిటినీ తన గుప్పెట్లో పెట్టుకొన్న రవీంద్రనాథ్‌రెడ్డి, ఉపకారం కంటే అపకారం చేశాడన్న ఆగ్రహం కడప నగర జనంలో కన్పిస్తున్నది. జగన్ ఓటు ప్రభంజనాన్ని గట్టిగా నిలువరిస్తున్న శక్తి ఈ అసంతృప్తి అనడం అతి శయోక్తి కాదు.

పులివెందులలో కూడా అదే పరిస్థితి. వైఎస్ అనుచర వర్గమంటూ చెప్పుకొన్న కొందరు స్థానికులు వైఎస్‌ను అడ్డం పెట్టుకొని కోట్లు కొల్లగొట్టారు. జగన్ వారికి ఎప్పుడూ అండగా నిలబడే వారు. దానితో అభివృద్ధి కంటే అవినీతి ఎక్కువగా జరిగింది అక్కడ. వైఎస్ అవినీతి, జగన్ దోపిడీల పట్ల ప్రజలలో పెద్దగా ఆందోళన లేదన్న మాట నిజం. కానీ స్థానికుల అవినీతి మీద మాత్రం కోపం, అసూయ పుష్కలంగా వున్నాయి. వాటిని అధిగమించడం జగన్‌కు కష్టంగా పరిణమిస్తున్నది.

ఈ రెండు నియోజకవర్గాలలో జగన్‌కు ఆశించినంత మెజార్టీ రాదని పరిశీలకులు చెప్తున్నారు. ఈ రెండు చోట్లా మెజార్టీ నిజంగా తగ్గితే, జగన్ కోరుకొంటున్న మూడు లక్షల మెజార్టీ అనుమానంలో పడక తప్పదు. సాధారణంగా వైఎస్‌కు ప్రతి ఎన్నికలోనూ పులివెందుల నియోజకవర్గంలో 50 నుంచి 70వేల ఓట్ల మెజార్టీ వచ్చేది. లోక్‌సభ నియోజకవర్గ గెలుపును అదే శాసించేది. ఇప్పుడది జరుగుతుందా అన్నది అనుమానం.

## కాంగ్రెస్ ఓటు బ్యాంక్ ఎవరికి?

ఎవరెన్ని చెప్పినా కాంగ్రెస్‌కు ఒక నిర్దుష్టమైన ఓటు బ్యాంక్ వుండి తీరుతుందని, అది చెక్కుచెదరదని కాంగ్రెస్ నేతలు విశ్వసిస్తున్నారు. కనీసం మూడు లక్షల ఓట్లు ఈ ఓటు బ్యాంకు ద్వారా తాము సాధించగలమని వారి ఆశ. అదే జరిగితే జగన్ గెలుపు సందేహంలో పడుతుంది. కానీ జగన్ వర్గం మాత్రం ఈ వాదనను తిరస్కరిస్తున్నది.

కాంగ్రెస్ ఓటు బ్యాంక్ సమస్తం తమకు బదలీ అయిపోయిందన్నది వీరి వాదన. అలవాటు తప్పని వారు, గుర్తు గందరగోళం పడేవారు ఏ కొందరో తప్పించి నూటికి 99శాతం కాంగ్రెస్ ఓటు బ్యాంక్ తమది కాబట్టే, తమ పక్షంగా అంతటి ఓటు ప్రభంజనం కన్పిస్తున్నదని వీరి వాదన.

## తెలుగుదేశం నిబ్బరం

గత ఎన్నికలలో తెలుగుదేశం పార్టీకి 3లక్షల 71వేల ఓట్లు వచ్చాయి. అది వైఎస్ బ్రతికి వున్న సమయం. ఆయన అధికార ప్రాబవం ఉచ్ఛ దశలో వున్న తరుణం. పైపెచ్చు ఎమ్మెల్యే ఎన్నికలతో కలిసి జరిగిన లోక్‌సభ ఎన్నిక. ఇప్పుడు వైఎస్ లేడు. ఎమ్మెల్యే ఎన్నికలు లేవు. అందువల్ల గతం కంటే పెరగకపోయినా ఆనాటి ఓట్లు అయితే తప్పక పడతాయన్నది తెలుగుదేశం ధీమా. అందువల్లనే వారు చాలా నిబ్బరంగా వున్నారు. కాంగ్రెస్, ప్రజారాజ్యం ఓట్లను జగన్, డిఎల్ రవీంద్రరెడ్డి పంచుకొని, తమ ఓట్లు తమకు పడితే, తమదే గెలుపు కదా అన్నది వారి నిబ్బరం. అయితే ఎన్నికల రాజకీయాలలో లెక్కలు కొంత వరకే పని చేస్తాయి. సానుభూతి పవనం వీస్తున్నప్పుడు లెక్కలన్నీ తారు మారు కావడం ఎన్నోసార్లు చూశాము. అందువల్ల తెలుగుదేశం నిబ్బరాన్ని పరిగణనలోకి తీసుకోలేక పోతున్నారు పరిశీలకులు.

## బాబాయికి ఒకటి, అబ్బాయికి ఒకటి

పులివెందులలో తనకొక ఓటు, అబ్బాయికి ఒక ఓటు వేయమని కోరుతున్నాడు వైఎస్.వివేకానంద రెడ్డి. కాంగ్రెస్ కార్యకర్తలంతా అదే ప్రచారం చేస్తున్నారు. ఈ నియోజకవర్గంలో తాను గెలిస్తేనే తిరిగి మంత్రినయ్యే అవకాశం వుంది కాబట్టి, పులివెందుల ఓటర్లతో తనకున్న సాన్నిహిత్యం రీత్యా ఒక ఓటు తనకు వేసి తీరుతారని, వైఎస్ పట్ల అభిమానం వున్న వారు జగన్‌కు ఒక ఓటు వేసి ఆ తృప్తి తీర్చుకొంటారని వైఎస్ వివేకానందరెడ్డి వ్యూహం. ఇది ఎక్కడకు దారితీస్తుందో చెప్పడం కష్టం.

# థర్మల్ కేంద్రంపై

16వ పేజీ కొరవ

రైతులలో వుంది. కాలుష్యం వల్ల వచ్చే ప్రమాదం మీద భయమూ వుంది.

ఈ నేపథ్యంలో నేలటూరు హరిజనులు, మత్స్యకారులు గాయత్రి థర్మల్ కేంద్రం ఎదుట వారం రోజుల నుంచి రిలే నిరాహార దీక్షలు చేస్తున్నారు. ఫ్యాక్టరీ లోపల జరుగుతున్న నిర్మాణపు పనులన్నిటినీ అడ్డుకొని, నిలిపి వేయించారు. ఫ్యాక్టరీకి ప్రభుత్వం ఇచ్చిన భూమిలో 110 ఎకరాల వరకు తాము సాగు చేసుకొంటున్న భూమి వుందని, కానీ దానికి సంబంధించిన పరిహారం తమకు ఇవ్వకుండా బినామీ పేర్లతో కొందరు భూస్వాములకు చెల్లించారని వీరి ఆరోపణ. దాన్ని తమకు ఇచ్చే వరకు పనులు జరగడానికి లేదని సమ్మె కట్టారు వారు.

నేలటూరు గ్రామానికి చెందిన భూములను ఎప్పుడో పదేళ్ల క్రితమే స్వాధీనం చేసుకొన్నది ప్రభుత్వం. అప్పట్లో పట్టా వున్న వారికి ఎకరా 59వేల లెక్కన, డి-ఫాం పట్టా వున్న వారికి 41వేల రూపాయల లెక్కన పరిహారం చెల్లించింది. అయితే ఎవరి కోసం ఈ భూములు సేకరించారో, వారు పరిశ్రమ పెట్టలేదు. దానితో, వీటిని ఎపి జెన్‌కోకు ఇచ్చారు. వారు తమకు పోను మిగిలిన 1500 ఎకరాలను గాయత్రి ఎనర్జీ వెంచర్స్‌కు ఎకరా పది లక్షల లెక్కన అమ్మివేశారు. ఆ గాయత్రి కంపెనీ ఆ తర్వాత సింగపూరుకు చెందిన సెంబ్‌కార్ప్ ఇండస్ట్రీస్ అనే కంపెనీకి అధిక ధరతో 49శాతం వాటా విక్రయం చేసింది. ఈ మధ్యలో కృష్ణపట్నం పరిసరాలలో సేకరించే భూములకు ఎకరా ధర 7 లక్షల యాభై వేల రూపాయలుగా పెంచింది ప్రభుత్వం. సేకరణకు పోగా మిగిలిన భూములకు మార్కెట్ ధర ఆకాశాన్ని అంటింది. ఒక దశలో ఎకరా యాభై లక్షల వరకు పలికింది.

తమ పక్కన వుండే గ్రామాల రైతులు అంతంత లాభపడుతున్నప్పుడు తమకు మాత్రం అన్యాయంగా 50వేల రూపాయలు చేతిలో పెట్టారన్న అసంతృప్తి నేలటూరు గ్రామస్తులలో వుంది. కానీ వారికి సరైన ప్రోత్సాహం ఇచ్చేవారు లేక ఇంత కాలం ఆ అసంతృప్తిని లోలోపలే అణుచుకొన్నారు. ఆ నామమాత్రం ధర కూడా తమకు దక్కలేదని నేలటూరు హరిజనులు, మత్స్యకారులు ఆందోళనకు దిగడంతో, ఇంతకాలం అసంతృప్తిని అణుచుకొన్న రైతాంగమంతా ఒక్క పెట్టున వారికి మద్దతుగా నిలుస్తున్నారు. అయితే భూముల సేకరణ, పరిహారం తమకు సంబంధం లేని వ్యవహారమని, మొత్తం భూములకు విలువ నిర్ణయించి తమ దగ్గర ప్రభుత్వం డబ్బు తీసుకొన్నది కాబట్టి, వారినే వెళ్లి అడగండని గాయత్రి అధికారులు చెప్తున్నారు. అది గ్రామస్తులకు నచ్చడం లేదు. 10వేల కోట్ల రూపాయల పెట్టుబడితో ఫ్యాక్టరీ కడుతున్న వారికి, తామడిగే పది కోట్లు కూడా చేయని పరిహారం మీద పట్టుదల ఎందుకన్నది గ్రామస్తుల వాదన. ఇద్దరి మధ్య రాజీ కుదరడం లేదు. ఎక్కడి పనులు అక్కడ స్తంభించి పోయి వున్నాయి.

ఉన్మాదం వలె నిర్మితమౌతున్న కృష్ణపట్నం థర్మల్ కేంద్రాల మీద మొట్టమొదటిసారిగా జరుగుతున్న ప్రజా ఉద్యమం ఇది. ఏ రాజకీయ పార్టీ కూడా దీనికి నాయకత్వం వహించడం లేదు. వేనాటి శ్రీనివాసులురెడ్డి, శేషారెడ్డి వంటి స్థానిక రైతులు ఉద్యమాన్ని నడిపిస్తున్నారు. ఈ అవకాశాన్ని వాడుకోవాలనే ఆత్రుతతో సిపిఎం నాయకులు, కొందరు తెలుగుదేశం కార్యకర్తలు అక్కడ గుమికూడుతున్నారు కానీ, వారి చేతిలో ఏమీ లేదు. స్థానిక ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి ఎందువల్లనో అటు ఇటు ఎవరి పక్షం వహించకుండా మౌనంగా పరిస్థితి గమనిస్తున్నాడు. కృష్ణపట్నంలో జరుగుతున్న పారిశ్రామిక అభివృద్ధి విలువతో పోలిస్తే, నేలటూరు వాసులు అడుగుతున్న కోరిక చాలా చిన్నది. నామమాత్రమైనది. ఫ్యాక్టరీ యాజమాన్యం పెద్ద మనసుతో ఆలోచన చేసి, ఈ స్థాయిలోనే రాజీకి సిద్ధపడితే మంచిది. గోటితో పోయేదానికి గొడ్డలి వరకు తెచ్చుకొంటే, అక్కడ ఏ పరిశ్రమా సాఫీగా నడవదన్నది నిజం.

# నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

వైశ్య మహాసభ రాష్ట్ర కార్యదర్శిగా నియమితులయ్యారు. చలమయ్య ఎంపికకు మాజీ ముఖ్యమంత్రి కొణిజేటి రోశయ్య, రాష్ట్ర మంత్రి టి.జి.వెంకటేష్ సహకరించారు.

# జనవాణి

2వ పేజీ కొరవ

ఊరేగింపుకు తెనాలి మస్తానవలి మేళతాళాలు. ఇది ఇలాగే వర్థిల్లాలి. మన సంస్కృతి గతి తప్పకుండా నడవాలి.

తూపిలి వనమాలి — నెల్లూరు

## సరకులు ఇవ్వడం లేదు!

విడవలూరు మండల కేంద్రంలోని 26వ నెంబరు చౌకదుకాణం నిర్వహించే సిహెచ్.వెంకట శేషమ్మ రేషన్ సరకులు సరిగ్గా ఇవ్వడం లేదు. మొత్తం సరకులు బ్లాక్ మార్కెట్‌లో అమ్మేస్తుంది. కిరోసిన్ వచ్చిన రోజే అయిపోయిందంటుంది. ఈ రేషన్ షాపు కామాక్షినగర్, సుందరయ్య నగర్, లైబ్రరీవీధి ప్రజలకు అందుబాటులో లేదు. ఈ విషయమై రెవిన్యూ అధికారులకు నివేదించినా చర్యలు లేవు.

కె.వినీల — నెల్లూరు

# నెల్లూరు కాంట్రాక్టర్ బలిపశువు

16వ పేజీ కొరవ

వ్యవహారాన్ని త్రవ్వి తీసిన సిబిఐ ఈ సబ్ కాంట్రాక్ట్ కంపెనీల బ్రతుకును కూడా బట్టబయలు చేసింది. ఎకెఆర్ కన్‌స్ట్రక్షన్స్ చేసిన 13 కోట్ల రూపాయల పనిలో నిజంగా జరిగిన పని మూడు కోట్లకు మించి లేదని, తతిమా పది కోట్ల రూపాయలు దొంగ బిల్లులు పెట్టి తిన్నారని సిబిఐ ఆరోపణ. దానికి సంబంధించిన రుజువులు దొరకడంతో క్రిష్ణారెడ్డిని అదుపులోకి తీసుకొన్నారు. దీని నుంచి తప్పించుకోవడానికి క్రిష్ణారెడ్డి చాలా ప్రయత్నాలు చేశాడు. హైదరాబాద్, ఢిల్లీ కోర్టులలో యాంటిసిపెటరీ బెయిల్ కోసం దరఖాస్తు చేశాడు. కానీ ఆ న్యాయస్థానాలలో ఆయనకు చుక్కెదురైంది. దానితో నెల రోజుల నుంచి ఎవరికీ దొరకకుండా వెళ్లి పోయాడు. కానీ సిబిఐ బృందం ఆయన ఇల్లు, ఆఫీసుల మీద దాడులు చేయడంతోపాటు, క్రిష్ణారెడ్డి ఆచూకీ కూడా కనిపెట్టి అదుపులోకి తీసుకొన్నది.

సిడబ్ల్యుజి కుంభకోణంలో కొన్ని వేల కోట్ల రూపాయల ప్రజాధనాన్ని కల్మాడీ ముఠా నంజుకతిన్నది. మొత్తం కుంభకోణంతో పోల్చి చూస్తే క్రిష్ణారెడ్డి చేసిన అపరాధం నామమాత్రమే. కానీ సాక్ష్యాలు దొరకడంతో తప్పు చిన్నదైనా పెద్ద శిక్ష అనుభవించాల్సి వస్తున్నదాయనకు. నిజానికి క్రిష్ణారెడ్డి ఢిల్లీ స్థాయిలో కామన్‌వెల్త్ గేమ్స్ వంటి అంతర్జాతీయ స్థాయి కాంట్రాక్ట్ పనులను చేసే హైప్రొఫైల్ కాంట్రాక్టర్ కాదు. ఎక్కడో ఎవరో ఆయన్ను తమ దోపిడీకి పావుగా వాడుకొన్నట్లున్నారు పాపం. ఎవరి కోసమో బలిపశువై పోయాడు.

# మంత్రుల మూకుమ్మడి సమ్మె

మొదటి పేజీ కొరవ

అయోమయంలో పడక తప్పదనిపిస్తున్నది. కడప ఎన్నికలలో జగన్ ఏ మాత్రం మెజార్టీతో గెలిచినా మంత్రులు, ఎమ్మెల్యేలు తక్కెడలో నుంచి దూకే కప్పల వలే వ్యవహరిస్తారన్నది నిజం. జగన్ కోరుకొంటున్నది కూడా అదే. తన గెలుపు కాంగ్రెస్ ప్రభుత్వానికి మరణ శాసనం కావాలని ఆకాంక్షిస్తున్నారాయన. ఆయన కోరిక నెరవేరదని చెప్పడానికి కారణాలు ఏవీ కన్పించడం లేదు.

# సాంఘిక సంక్షేమ శాఖలో కుమ్ములాట!

**జిల్లా సాంఘిక సంక్షేమ శాఖ కార్యాలయంలో అంతర్గత పోరు కొనసాగుతోంది. పనితీరును పర్యవేక్షించాల్సిన అదనపు జాయింట్ కలెక్టర్ సీతారామయ్య దృష్టి సారించలేక పోతున్నారు. దీనివల్ల ఇక్కడ ఎవరికి వారే యమునాతీరే అన్న పరిస్థితి నెలకొని వుంది.**

జిల్లా సాంఘిక సంక్షేమశాఖ కార్యాలయంలో అంతర్గత పోరు కొనసాగుతోంది. ఈ కార్యాలయంలో విధులు నిర్వహించే సిబ్బంది, అధికారిణి మధ్య విభేదాలు చోటు చేసుకొని కార్యకలాపాలు పూర్తిగా స్తంభించిపోయాయి. ఈశాఖ అధికారిణి అంబేద్కర్ జయంతి మరుసటి రోజు నుంచి సెలవుపై వెళ్లారు. ఈ శాఖలో ఆధిపత్యపోరు తారాస్థాయికి చేరుకోవడమే ఈమె సెలవుపై వెళ్లేందుకు కారణమని తెలుస్తుంది. సాంఘిక సంక్షేమశాఖలో పోస్టింగ్ భర్తీ, పదోన్నతుల విషయంలో కూడా అధికారిణి, సిబ్బంది మధ్య విభేదాలు చోటుచేసుకున్నాయి.

ఈశాఖ డిప్యూటి డైరెక్టర్‌గా వున్న సీతా మహాలక్ష్మి ఎన్ని అక్రమాలకు పాల్పడినా పట్టించుకునేవారు లేకుండా పోవడంతో ఇష్టానుసారంగా వ్యవహరిస్తూందన్న ఆరోపణలు వున్నాయి. బదలీపై వెళ్లిన జిల్లా కలెక్టర్ రాంగోపాల్ అండదండలు పుష్కలంగా వుండడంతో పలు దఫాలు రాష్ట్రస్థాయి అధికారులు విచారణ చేసినా చర్యలు మాత్రం తీసుకోలేకపోయారు. ప్రస్తుతం పాఠశాలలకు వేసవి సెలవులు ప్రకటించడంతో హాస్టళ్లు కూడా మూతపడ్డాయి. హాస్టల్ విద్యార్థులకు చెల్లించాల్సిన మెస్‌బిల్లులు, కాస్మోటిక్స్ చార్జీలు ఇతర బిల్లులు మంజూరు కోసం వార్డెన్లు డిడి కార్యాలయం చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నారు.

ఔట్ సోర్సింగ్ సిబ్బంది నియామకం, కారుణ్య ఉద్యోగాల భర్తీ విషయంలో కూడా సదరు అధికారిణి పలు అక్రమాలకు పాల్పడ్డారన్న ఆరోపణలు వున్నాయి. అధికారిణికి అనుకూలంగా వున్నవారికి కోరిన ప్రాంతంలో పోస్టింగ్ ఇస్తూ ఇతరులకు తీరని అన్యాయం చేస్తుందని ఈశాఖ ఉద్యోగులే విమర్శలు చేస్తున్నారు. నాల్గవ తరగతి ఉద్యోగుల సంఘం, వార్డెన్ల అసోసియేషన్ ప్రతినిధులు సైతం అధికారిణి వ్యవహరిస్తున్న తీరుపై అసహనం వ్యక్తం చేస్తున్నారు. గతంలో ఈమె బదలీ అవుతారని ప్రచారం జరిగినా రాజకీయ ప్రయత్నాలతో బదలీని నిలుపుదల చేయించుకున్నట్లు తెలిసింది. ఇటీవల కొత్త కలెక్టర్ బాధ్యతలు తీసుకున్న సమయంలో కూడా ఈమె జాడ కనిపించలేదు.




నెల్లూరులోని సాంఘిక సంక్షేమ భవనం.

అధికారిణి వ్యవహారం పైవిధంగా వుండగా స్కాలర్‌షిప్పులు, ఫీజు రీఎంబర్స్‌మెంటు విభాగంలో పనిచేస్తున్న మధుసూధన్ పనితీరుపై విద్యార్థి సంఘాలు ఆగ్రహం వ్యక్తం చేస్తూ మండిపడుతున్నాయి. కార్పొరేట్ కళాశాలలకు అనుకూలంగా వ్యవహరిస్తూ పేద విద్యార్థులకు తీరని అన్యాయం చేస్తున్నాడంటూ ఆరోపణలు చేస్తున్నారు. కళాశాలలో చదువుతున్న విద్యార్థుల బ్యాంకు ఖాతాకు స్కాలర్‌షిప్పును జమ చేయకుండా కళాశాల యాజమాన్యం చెప్పిన విధంగా నడుచుకుంటూ నిబంధనలను పాటించడం లేదన్నది వీరి ఆవేదన. సాంఘిక సంక్షేమశాఖ కార్యాలయంలో విధులు నిర్వహించే మధుసూధన్ దిష్టిబొమ్మను కూడా ఇటీవల విద్యార్థి సంఘాలు దహనంచేసి నిరసన వ్యక్తం చేశాయి. ఈ కార్యాలయ పనితీరును పర్యవేక్షించాల్సిన అదనపు జాయింట్ కలెక్టర్ సీతారామయ్య ఏ కారణం చేతనో సరైన దృష్టి సారించలేకపోతున్నారు. సాంఘిక సంక్షేమశాఖ కార్యాలయంలో చోటుచేసుకున్న అంతర్గత విభేదాల కారణంగా విద్యార్థులు నష్టపోయే పరిస్థితి ఏర్పడింది. కొత్తగా బాధ్యతలు తీసుకున్న కలెక్టర్ శ్రీధర్ ఈశాఖపై ప్రత్యేక దృష్టి సారిస్తే బాగుంటుంది.

---

● అవిశ్రాంత సామాజిక సేవకుడు

# అల్లూరు ఆదిశేషారెడ్డి!

గత మూడు దశాబ్దాలుగా గూడూరు ప్రాంతంలో పలు సామాజిక సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు అల్లూరు ఆదిశేషారెడ్డి. తోటివారికి చేతనైనంత సహాయ సహకారాలు అందించడం ద్వారా ఆత్మ సంతృప్తి కల్గుతుందని నమ్మి ఆ దిశగా తనవంతు సేవా కార్యక్రమాలను చేపడుతున్న సామాజిక సేవకుడు ఆదిశేషారెడ్డి. గత 50 ఏళ్లుగా రొటేరియన్‌గా వున్న ఆయన 93 ఏళ్లగా వృద్ధాప్యాన్ని దరికి రానీయకుండా ఇప్పటికీ విశేషకృషి చేస్తున్న వ్యక్తిగా పేరు గడించాడు.

1982లో తన పేరిట అల్లూరు ఆదిశేషారెడ్డి రివాల్వింగ్ ఛారిటీస్‌ను స్థాపించిన ఆయన విద్య ద్వారానే అభివృద్ధి సాధ్యమవుతుందని నమ్మి పేద విద్యార్థులు ఎంతో మందికి ఆర్థిక సహాయం అందించి వారి ఉన్నత చదువులకు తోడ్పడ్డారు. ప్రతి ఏడాది మెడికల్ విభాగంలో ఉత్తమ మార్కులు సాధించిన వారికి గోల్డ్‌మెడల్‌ను ప్రదానం చేస్తున్నారు. చదువుతోపాటు క్రీడలను ప్రోత్సహించాలన్న ఉద్దేశ్యంతో 25 ఏళ్ల క్రిందట గూడూరులో క్రీడాభివృద్ధి కోసం లక్షల రూపాయలు వెచ్చించి స్టేడియం నిర్మించారు. తన పేరిట రోటరీ స్పోర్ట్సు, గేమ్స్ ట్రస్టును స్థాపించి దాని ద్వారా పలు క్రీడలకు ఆర్థిక సహాయం అందిస్తున్నారు. ప్రతి ఏటా స్పోర్ట్సుడే నిర్వహిస్తుండడం విశేషం. జూలైన 1న ఆదిశేషారెడ్డి జన్మదినం సందర్భంగా అల్లూరు ఆదిశేషారెడ్డి ప్రభుత్వ స్టేడియంలో గూడూరులోని అన్ని హైస్కూళ్ల విద్యార్థులకు స్పోర్ట్సుమీట్ జరపడం ఆనవాయితీ. దక్షిణ భారత స్థాయిలో క్రికెట్ పోటీల నిర్వహణకు ఆర్థిక సహాయం అందించడం ఆయన దాతృత్వానికి నిదర్శనం.

వృత్తి విద్యను అభ్యసించే విద్యార్థులను ప్రోత్సహించేందుకు దొడ్ల రుక్మిణమ్మ రోటరీ స్కాలర్‌షిప్స్ పేరిట ప్రతి సంవత్సరం 1.75 లక్షల రూపాయలు ఉపకారవేతనాలుగా అందిస్తున్నారు. రోటరీ భవన్ నిర్మాణానికి ఐదు లక్షల రూపాయలు విరాళంగా ఇచ్చారు. అన్ని దానాల్లోకి అన్నదానం గొప్పదని తలచి పెంచలకోనలో నిత్యాన్నదాన పథకానికి లక్ష రూపాయలు




గూడూరులో ఆదిశేషారెడ్డి నిర్మించిన స్టేడియం. ఇన్‌సెట్‌లో అల్లూరు ఆదిశేషారెడ్డి.

విరాళంగా అందించారు. పెంచలకోనలో ముఖ మండప నిర్మాణానికి, గూడూరులో బ్రహ్మకుమారి కేంద్ర భవన నిర్మాణానికి స్థలాన్ని ఇచ్చి విద్య, ఆధ్యాత్మిక, క్రీడా రంగాల్లో తనవంతు సహకారాన్ని అందిస్తున్నారు. జీవిత చరమాంకంలో పిల్లల నిర్లక్ష్యానికి గురికాబడిన వృద్ధులను 70 మందిని గుర్తించి వారికి ప్రతినెలా రోటరీ సర్వీస్ యాక్టివిటీ ట్రస్టు ద్వారా గత ఏడేళ్లగా పలసరుకులు అందిస్తూ సేవా నిరతిని చాటుతున్న ఆదిశేషారెడ్డి నిజంగా అభినందనీయుడు.

# థర్మల్ కేంద్రంపై తొలి ప్రజా ఉద్యమం!

- గాయత్రి ఎదుట నేలటూరు గ్రామస్తుల దీక్ష.
- భూముల పరిహారం కోసం పోరాటం.
- ఏ రాజకీయ ప్రమేయమూ లేదు.
- పారిశ్రామికుల గుండెల్లో గుబులు.
- అన్ని థర్మల్ కేంద్రాలలోనూ ఇదే సమస్య.

కృష్ణపట్నంలో తామర తంపరగా నెలకొంటున్న థర్మల్ విద్యుత్ కేంద్రాల పై స్థానిక ప్రజలలో పలురకాల అనుమానాలు, ఆందోళనలు, అలజడులు వున్నాయి. వాటివల్ల తమ బ్రతుకులు బాగుపడతాయా లేక చిద్రమై పోతాయా అన్నది స్థానికులకు అంతుబట్టని ప్రశ్న. ఒక వంక పారిశ్రామిక అభివృద్ధి జరిగితే, భూముల ధరలు పెరుగుతాయని, ఉద్యోగాలు దొరుకుతాయని, తమ ప్రాంతం పట్టణ కళ సంతరించుకొంటుందని, జీవన ప్రమాణాలు పెరుగుతాయని ఆశ వుంది. మరొక ప్రక్క థర్మల్ కేంద్రాలు విసర్జించే బొగ్గు పులుసు వాయువులు, బూడిద కుప్పలు తమ ప్రాంతాన్ని కాలుష్య కాసారంగా మారుస్తాయన్న భయం వుంది. ఈ రెండింటిలో ఏది నిజం ఏది అబద్ధం అన్న వివరణ ఇచ్చేవారు లేరు. దానితో జనం ఎవరికి తోచినది వారు వూహించుకొంటున్నారు.

సాధారణంగా ఇటువంటి పరిస్థితులలో రాజకీయ పార్టీలు, ప్రజా సంఘాలు ప్రజలకు ఒక దారి చూపించాలి. కానీ కృష్ణపట్నం పరిసరాలలో జరుగుతున్న పారిశ్రామిక అభివృద్ధి విషయంలో ఒక్క రాజకీయ పార్టీ కూడా ప్రజల పక్షం నిలబడడం లేదు. దాదాపుగా అందరు రాజకీయ నేతలు, అన్ని రాజకీయ పార్టీలు అక్కడి పారిశ్రామికులతో లాలూచీ వ్యవహారాలు నడపడమే అందుకు కారణం. జిల్లాకు చెందిన ఎమ్మెల్యేలు, ఎమ్పీలు, మంత్రులు, రాష్ట్ర, జాతీయ స్థాయి నేతలు అందరూ ఈ పారిశ్రామికులతో మొగమాటాలు పెంచుకొన్నారు. ఎన్నికల ఖర్చు నుంచి, వారు కట్టుకొనే ఇళ్లకు సిమెంటు, ఇటుకల వరకు అన్నీ ఆ పారిశ్రామికుల నుంచే అందుతున్నాయి. చాలా మంది చోటా మోటా రాజకీయ వాదులు వీరి నుంచి నెల జీతాలు, రౌడీ మామూళ్లు అందుకొంటున్నారు. దానితో ఏ ఒక్కరు కూడా అక్కడి వ్యవహారాలలో ఆసక్తి చూపడం లేదు. చొరవ ప్రదర్శించడం లేదు.

తెలుగుదేశం జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి ఒక్కడు మాత్రం గత ఏడాది కాలంగా స్థానిక ప్రజానీకాన్ని చైతన్యపరచడానికి ప్రయత్నిస్తున్నాడు. గ్రామాల స్థాయి నుంచి ఢిల్లీ వరకు ఏదో ఒక కలకలం సృష్టిస్తున్నాడు. అయితే ఆయన ప్రయత్నానికి ప్రజా సహకారం ఆశించినంత లభించడం లేదు. థర్మల్ కేంద్రాల వల్ల నష్టమా లాభమా అన్న స్పష్టత రైతాంగంలో లేకపోవడమే అందుకు కారణం. థర్మల్ కేంద్రాల వల్ల తమ భూముల ధరలు పెరుగుతాయి కాబట్టి, వాటి మీద ఉద్యమం చేస్తే తమకు నష్టం అన్న భావన చాలా మంది

కొరవ 14వ పేజీలో





- ఢిల్లీ ఆటల గోల్మాల్‌లో

## నెల్లూరు కాంట్రాక్టర్ బలిపశువు

చెట్టు మీద కాయకు, సముద్రంలో ఉప్పుకు సంబంధం కుదరడం వలె వుంది కామన్ వెల్త్ గేమ్స్ కుంభకోణంలో నెల్లూరు కాంట్రాక్టర్ ఎ.క్రిష్ణారెడ్డి భాగస్తుడన్న వార్త. ఎక్కడో ఢిల్లీలో ఉన్నత స్థాయిలో జరిగిన ఆ దగాకోరు వ్యవహారంలో ఇక్కడ నెల్లూరులో పెన్నా బ్రిడ్జి వంటి సాధారణ కట్టడాన్ని కట్టడం చేతకాక చతికిల పడిన ఒక అనామక కాంట్రాక్టర్ భాగం పంచుకోవడం విచిత్రం. కానీ అది నిజం.

మహమ్మదాపురానికి చెందిన ఎ.క్రిష్ణారెడ్డి నెల్లూరు జిల్లాలో వున్న వందలాది కాంట్రాక్టర్లలో ఒక్కడు. ఆయనకు పెద్దగా పేరు ప్రఖ్యాతులు లేవు. గొప్ప పనులు చేసిన చరిత్ర లేదు. కానీ ఆయన్ను సిడబ్ల్యుజి స్కాం దర్యాప్తు చేస్తున్న సిబిఐ బృందం అదుపులోకి తీసుకొన్నది. కామన్ వెల్త్ గేమ్స్‌లో జరిగిన "టైమింగ్, స్కోరింగ్ మరియు రిజల్ట్ రికార్డింగ్" అనే పనిని స్విట్జర్లాండ్‌కు చెందిన ఒక కంపెనీకి కేటాయించారు. దాదాపు 140 కోట్ల విలువైన పని ఇది. అందులో పెద్ద మొత్తాలు చేతులు మారాయన్న ఆరోపణపై సిబిఐ దర్యాప్తు ప్రారంభించింది. ఈ స్విస్ కంపెనీతో పాటుగా భారతదేశానికి చెందిన ఎమ్ఎస్ఐ సాఫ్ట్‌వేర్ అనే మరొక సంస్థ కూడా టెండర్ వేసింది. కానీ కల్మాడీ తన పలుకుబడి ఉపయోగించి భారతదేశ కంపెనీని పక్కకు నెట్టి, స్విస్ కంపెనీకి కాంట్రాక్ట్ ఇచ్చారు. ఆ స్విస్ కంపెనీ తనకొచ్చిన పనిలో కొంత భాగాన్ని గేమ్ ఇంటర్నేషనల్ అనే మరొక కంపెనీకి సబ్ కాంట్రాక్ట్ ఇచ్చింది. ఆ గేమ్ ఇంటర్నేషనల్ కంపెనీ ఆ సబ్ కాంట్రాక్ట్ పనిని ఎ.క్రిష్ణారెడ్డికి చెందిన ఎకెఆర్ కన్‌స్ట్రక్షన్స్‌కు సబ్ కాంట్రాక్ట్ క్రింద కేటాయించింది.

తీగలాగితే డొంక కదిలినట్లు స్విస్ కంపెనీ

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్




పై నుంచి ఆ మంట...
ముందు నుంచి ఈ మంటా...?



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.